# వేణీసంహారము

నాటకము





విద్వాన్

బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ.

# వేణీసంహారము

*

భట్టనారాయణుని సంస్కృత నాటకమునకు

[ ఆంధ్రీకృతి ]

*

విద్వాన్

బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ.

తొలికూర్పు 1951 మూ(డవకూర్పు 1958
రెండవకూర్పు 1957 నాలుగవకూర్పు 1965

బి. ఏ; బి. యస్. సి; ఎం. ఏ. పరీక్షలకు
పాఠ్య నాటకము

వెల రు. 3-50

(ప్రకాశకులు :
బి. వి. & సన్సు,
రామారావుపేట, కాకినాడ.

ముద్రాపకులు :
శ్రీవిజయలక్ష్మి (ప్రెస్,
కాకినాడ.

# అంకితము

౧

శ్రీగురుదేవదేవునకు, జిన్మయరూపున కాదిదేవనా
నాగమవేదికిన్ బరమహర్షికి కామవిజేతకున్ గృపా
శ్రీగుణరాశికిన్ సకలసిద్ధివశీకృతయోగమూర్తికిన్
త్యాగగుణాబ్ధికిన్ బరమతత్త్వరహస్యున కాత్మవేదికిన్.

౨

నాకు సమస్తమైనయతినాథునకున్ బరమాత్మ, గన్న సు
శ్లోకునకున్ జగద్వినుతశుద్ధచరిత్రున కాదిదైవత
శ్రీకమనీయరూపునకు శిష్టసదాచరణప్రవిష్టశో
భాకృతికిన్ జగద్భరితపావనతేజున కాత్మమూర్తికిన్.

౩

ఆర్షకులాభిజాతునకు నార్షగుణోదధికిన్ నిరంతరా
కర్షణశక్తియుక్తునకు గానకళాకమనీయవేదికిన్
హర్షసమున్నతాత్మున కనంతక్షమానిధికిన్ మహర్షి కా
ర్యర్షికి జ్ఞానవర్షి కిది యంకిత మౌత ! సభక్తికంబుగన్.

# నాటకపాత్రలు

పురుషులు

యుధిష్ఠిరుఁడు
భీమసేనుఁడు
అర్జునుఁడు
నకులుఁడు
సహదేవుఁడు

కృష్ణుఁడు

*

ధృతరాష్ట్రుఁడు
దుర్యోధనుఁడు
కర్ణుఁడు
కృపుఁడు
అశ్వత్థామ
సంజయుఁడు
సుందరకుఁడు
జయంధరుఁడు
వినయంధరుఁడు
చార్వాకుఁడు
రాక్షసుఁడు

*

స్త్రీలు

ద్రౌపది
భానుమతి
గాంధారి
దుస్సల
జయద్రథమాత
రాక్షసి
చేటి, నటి

*

# వేణీసంహారము : పీఠిక

సుప్రసిద్ధములై నేఁటికిని సంతత పఠన పాఠనవ్యవహారమునఁ గానవచ్చుచున్న సంస్కృత నాటకములలో మృగరాజలక్షణుఁ డైన భట్టనారాయణుని "వేణీసంహార" మొకటి. ఈ భట్టనారాయణుని కాలము నిదమిత్థమని నిర్ణయించుటకుఁ దగిన యాధారము లంతగా లేవుకాని, వామనుఁడు కావ్యాలంకార సూత్రవృత్తియందును, అభినవగుప్తుఁడు ధ్వన్యాలోకమునందు నీతని "వేణీసంహారము" నుండి కొన్ని శ్లోకముల నుద్ధరించియుండుటచే నీతఁడు వారి కాలమునకే ప్రఖ్యాతుఁడై యుండెననియు బహుశః క్రీ. శ. ఏడవ శతాబ్ది యుత్తరార్ధమున జీవించియుండుననియు విమర్శకు లూహించుచున్నారు. పైని పేర్కొనఁబడిన వారిరువురేకాక యింకను బలువురు లాక్షణికులును గవులును భట్టనారాయణుని వేణీసంహారము నుదాహరణముగను నాదర్శముగను గ్రహించుటనుబట్టి యప్పటి పండితులలో నీతనికిఁ గల గౌరవము వెల్లడిం[illegible]చున్నది. ధనంజయుఁడు దశరూపకమున వేణీసంహారమునుండి పలుచోట్ల నుదాహరణము లొసంగియుండెను. రాజశేఖరుఁడు తన బాలరామాయణమున నచ్చటచ్చట వేణీసంహారము ననుసరించెనని చెప్పుటకు నిదర్శనము లున్నవి. భట్టనారాయణుఁడు వేణీసంహారమున నాటకలక్షణముల నన్నింటిని సమగ్రముగా ననుసంధింప యత్నించి యందుఁ గృతార్థుఁ డయ్యెను. ఈదృష్టితోఁ జూచిన వేణీసంహారము సంస్కృతనాటక వాఙ్మయమున నద్వితీయమై యలరారుచుండును.

దుశ్శాసనుఁడు సాధ్వియైన ద్రౌపదిని గొప్పుపట్టి సభలోనికీడ్చి వలువ లొలిచి పరాభవించెను. ఆపరాభవమునకుఁ బ్రతీకారము జరుగు

వఱకుఁ దనకొప్పు ముడిపెట్టనని యామె ప్రతినపట్టెను. ప్రియసాహసుఁడైన భీముఁడు తన గదాదండముచే దుర్యోధనుని యూరులు విఱుగనడిచి తద్రక్తసిక్తములైన చేతులతో ద్రౌపది వేణి ముడిపెట్టెను. రసభరితమైన యీ సన్నివేశమునుండియే నాటకమునకు "వేణీసంహార"మనుపేరు కలిగినది. చతుర్థాంకమున సుందరకుఁడు చెప్పిన యుద్ధ వృత్తాంతమువంటి యనాటకోచిత కథనఘట్టములు కొన్ని యున్నను ఈనాటకమునకు వన్నెచేకూర్చిన సన్నివేశము లెన్నియో కలవు. తృతీయాంకమునందలి వాగ్వివాదరంగమున సంభాషణక్రమసౌందర్యము పరాకాష్ఠ నందియున్నది. వీరముతోపాటు శృంగారరౌద్రకరుణాదులును నిందుఁ జక్కఁగాఁ బోషింపఁబడియే యున్నవి. ఇంకఁ బాత్రపోషణమున భట్టనారాయణుఁడు ప్రదర్శించిన నేర్పు మిక్కిలి ప్రశంసాపాత్రముగ నున్నది. ద్రౌపదీ భానుమతులాదర్శపతివ్రతలుగాఁ జిత్రింపఁబడినారు. దుర్యోధనుని యౌద్ధత్యమును, భీముని ధీరోదాత్తతను, యుధిష్ఠిరుని శాంత ప్రజానురాగములను, కృష్ణుని సమయోచిత వాక్చాతుర్యమును, కర్ణాశ్వత్థామల పరస్పరోపాలంభములను, ధారీ ధృతరాష్ట్రుల పుత్రప్రేమను గవి చక్కఁగాఁ బోషించియుండెను. ర్వాకపాత్ర కల్పనము నాటకానురక్తిని బలువిధములఁ బెంపొందించుచున్నది. శృంగారమున కిందంతగా స్థానము లేకున్నను గవి దాని నిందుఁ జొప్పించి పూర్వనాటకసంప్రదాయకమును పాటించినవాఁడయ్యెను.

ఇంక ననువాదము విషయము. దీని ననువదించినవారు సర్వాంధ్రజన విదితులును, పండితాగ్రేసరులును, బహుగ్రంథరచనా ధురంధరులును, నిఘంటునిర్మాణనిపుణులు నగు శ్రీ విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ; గారు. వీ రిదివఱకే దిఙ్నాగుని కుందమాల, భాసుని యభిషేకనాటకము మున్నగు వానిని తెనుఁగున కనువదించి తమ యనువాదనైపుణ్యమును బ్రదర్శించియున్నారు. ఇందలి యనువాదము సర్వవిధములఁ

టక్కఁగా నున్నది. శ్రీ వేంకటేశ్వరులుగారి హృదయమువలెనే వారి శైలియు బ్రసన్నమైనది; వారి వర్తనము వలెనే భాషయు ననవద్యమైనది. వారి దృష్టివలెనే రచనయు మిక్కిలి నిశితమైనది. వారిగ్రంథము లిహపర ములకు వంతెనలు. అవి వారి హృదయమున నెలకొన్న యాధ్యాత్మిక తానుషంగమునకు విమలాదర్శములు. ఏ పూర్వ జన్మ సుకృతముచేతనో నే నార్జించుకొన్న వారితోడి నెయ్యముతప్ప నీ పీఠిక వ్రాయుటలో నాకొండు పాత్రత లేదు.

ఆంధ్రభాషయందలి యనువాదములు మూఁడు తెఱంగులుగా నున్నవి. కథానువాదములు, భావానువాదములు, పదానువాదములు. అందుఁ గవిత్రయము వారి భారతము మొదటి తరగతికిఁ జెందునట్టిది. ఈపద్ధతి పేరున కనువాదమేకాని చాలవఱకు స్వతంత్రమైనదే. రెండవ పద్ధతికి శ్రీనాథుని నైషధాంధ్రీకరణము తార్కాణ. ఇది మూల విధేయమయ్యు స్వతంత్రమైనది. ఆధునిక కాలమునందలి సంస్కృతనాటకాంధ్రీకరణములు పెక్కు మూఁడవ పద్ధతికిఁ జెందును. ఇవి స్వతంత్రత యేమాత్రమును లేనిమూలమున కతివిధేయములైన పదానువాదములు. మూలసాహాయ్యము లేక యిందలి భావములను గనుఁగొనుట పెక్కుచోట్లఁ గష్ట సాధ్యమ్మ నుండును. నాకుఁ జూడఁగా నీ మూఁడు పద్ధతులలో రెండవదైన భావా వాదపద్ధతి ప్రశస్తముగాఁ గనుపట్టును. ఏలయన నది మూలమున కవిధేయ మును గాదు అతివిధేయమును గాదు. శ్రీ వేంకటేశ్వరులుగారి యనువాద మీ ఫక్కికిఁజెంది యమందానందమును జేకూర్చుచున్నది.

నిజము పరిశీలింపఁగా స్వతంత్రరచనమునకంటె ననువాదమునఁ గ్లేశము హెచ్చు. స్వతంత్రరచనమునఁ బదచ్ఛందోనుగుణముగా భావము నించించుక మార్చుకొనవచ్చును. మఱి యనువాదమున నాపదచ్ఛందము లనే మార్చుకోవలెనుగాని భావావిష్కరణమున నించుకయు మూలము

నధిగమించి పోరాదు. అట్లు పోయితిమా యనువాద మెంత మృదుమనో హరముగా నున్నను మూలమును దృష్టియందుంచుకొని చూచువారి కది యసంబద్ధముగా గోచరించును. అందుచే ననువాదమును సర్వజనానందకర ముగా సంతరించుట యసిధారావ్రతము వంటిది. దుష్కరమైన యీ వ్రత మును శ్రీ వేంకటేశ్వరులుగారవలీలమై నిర్వహించిరన్నచో నించుకయు నతిశయోక్తి యుండఁజాలదు,

అనువాదమున సాధారణముగా భావము యథామూలముగనే ప్రకటింపఁబడినను మూలమునందున్న కొన్ని పదములు లోపించుటయో లేని కొన్ని పదములు చేరుటయో సంభవించుచుండును. అధికముగా వాడఁ బడిన పదములు కేవల వ్యర్థపదములైనప్పుడును, లుప్తములైన పదములు భావగర్భితములైనప్పుడును దక్క నిట్టిమార్పు చేర్పులవలన నంతగా హాని యుండదు. వచనమున నీ కృచ్ఛ్ర ముండనే యుండదు కాని పద్యముల నెంతవారికైన నీ యతివ్యాప్త్యవ్యాప్తులు కేవలపదసంబంధులైనవి సంక్ర మింపక మానవు. శ్రీ వేంకటేశ్వరులుగా రిట్టి మార్పు చేర్పులకుఁ దావీయ కుండనే దమ యనువాదమును సాగించియుండిరి. చేర్పుకలిగినచోట నది యచ్చటి యర్థస్ఫూర్తికి పోషకముగానే యున్నది. మూలమునందలి శ్లోక ములను సీసములుగా ననువదించిన రెండు మూఁడుచోట్ల నిట్టిచేర్పు కాన వచ్చుచున్నది. కాని, యిది మూలమున గూఢముగా నున్నయర్థమును లెస్సగా వివరించుచు దానికివ్యాఖ్యానప్రాయముగనో వివరణప్రాయముగనో గానవచ్చుచున్నది. ఉత్కర్షావహమగుటచే నీ స్వాతంత్ర్యము ప్రశంసింపఁ దగినదనియే నాతలంపు. నైషధమున శ్రీనాథుఁడుసైతము కొన్ని సీసము లలో నిట్టి వివరణము గావించియుండెను.

సంస్కృత వేణీసంహారమునందలి శైలి ప్రాయికముగా దీర్ఘ సమాస భూయిష్ఠమును నోజోగుణ సంపన్నమునై యలరారుచుండును.

దర్శనైక ప్రయోజనములగు నాటకములం దిట్టిశైలి యంతగా నభిలషణీయము కాకపోయినను రసభావ సన్నివేశములతోడి యానుగుణ్యమునుబట్టి కొన్నియెడల నుచితముగాఁ గానిపింపకపోదు. వీరోచితాలాపముల సందర్భమున సమాసభూయిష్ఠమైన రచన మిక్కిలి సరసమును శక్తివంతమునై గోచరించును. శ్రీ వేంకటేశ్వరులుగారు మూలమునందలి గాంభీర్యమున కెచ్చటను గొఱఁత రాకుండ ననవసర పదాడంబరముపొంత పోకుండ రసభావానుగుణమైన శైలి నుపయోగించి యనువాదమును సరససుందరము కావించినారు. అనువాదము చేయునెడఁ దఱచుగా మూలపదముల యొక్కయుఁ దద్వ్యాఖ్యానపదములయొక్కయుఁ బ్రభావము హెచ్చుగాఁ జూపట్టుట సహజము. అట్టియెడ ననువాదభాషకు నిసర్గమైన నుడికారపు సొంపునకును జాత్యనకును నించుకభంగము వాటిలుటలో నాశ్చర్యముండదు. అట్లుగాక తెనుఁగుజాతీయమున కెచ్చటను నంతరాయము లేని సహజమధురమైన శైలిలో సాగిపోవుట యీ యనువాదమున నెన్నఁదగిన గుణవిశేషములలో నొకటి.

పురాణములను, కావ్యములను సంస్కృతమునుండి తెనుఁగున కనువదించిన పూర్వమహాకవు లేకతముననో రసనిధానములైన నాటకముల ననువదించుపనికిఁ బూనియుండలేదు. వారు 'కావ్యేషు నాటకం రమ్య'మ్మను నా నుడియందలి యాథార్థ్యము నెఱుంగమియో, సంస్కృత నాటకములందలి రసము నాస్వాదింపఁజాలమియో యందుకుఁ గారణముగాఁ జెప్పుట పొరపాటగును. దాని కనివార్యములైన కారణము లేవియో యుండును. వాని నిట విస్తరింపఁబనిలేదు. కాని, పూర్వమహాకవులే సంస్కృతనాటకములను గూడ ననువదించి యుండినచో నందలిరసము నిరవశేషముగాఁ దెలుఁగువారి కందియుండు నను వంత కొంత మనవారికిఁ బొడముచుండును. అట్టివంత తొలఁగించిన సమర్థులైన నాటకానువాదకు లిటీవలఁ గొందఱు వెలసి

యుండిరి. అట్టివారిలో శ్రీ వేంకటేశ్వరులుగా రొక్కరు. ఆధ్యాత్మికతో సంపాదనముతోపాటు స్వార్థరహితమైన భాషాసేవకూడఁ గావించుట వీరి జీవితాశయములలో నొకటి. వీరి సేవకు ఫలముగా నాంధ్రభాషాయోషకు సౌందర్యవర్ధకములైన పెక్కు నవ్యభూష లమరుట యాంధ్రుల యదృష్టము. సర్వ జగన్నియంతమైన భగవంతుఁడు శ్రీ వేంకటేశ్వరులుగారి కాయురారోగ్య భాగ్యము లొసంగి వారిచే నితోధికమైన భాషాసేవ చేయించుఁగాక !

ఉస్మానియా
విశ్వవిద్యాలయము
హైదరాబాదు.

డా॥ దివాకర్ల వేంకటావధాని,
ఎం. ఏ. (ఆనర్సు) పిహెచ్. డి.,
ప్రొఫెసరు, ఆంధ్రశాఖ,

—

# అనువాదకుని అవతారిక

## 1. వేణీసంహారము : కృతికర్త

వేణీసంహార మహానాటకమును రచించిన మహాకవి భట్టనారాయణుఁడు. ఒకానొక వంగీయగాథనుబట్టియు, "క్షితీశవంశావళీచరిత" మను వంగభాషాగ్రంథమునుబట్టియు, ఆదిశూ (సు ?)రుఁ డను వంగరాజు భట్టనారాయణుఁ డను కాన్యకుబ్జవిద్వద్బ్రాహ్మణునిఁ దనదేశమునకుఁ బిలిచి గౌరవించెనని గ్రిల్లుదొర 1871వ సంవత్సరమునఁ బ్రకటించిన వేణీసంహార పీఠికలోఁ దెలిపెను. దీనిని వంగీయుఁడగు ఆర్. యల్. వైద్యా బలపఱిచెను. కాని, పై రెండింటిలోను భట్టనారాయణుని యాధ్యాత్మిక సేవకు మెచ్చి యాదిశూరుఁ డైదూళ్లు బహూకరించెననియే యున్నది. కాని, భట్టనారాయణుఁడు కవి యనికాని వేణీసంహారకృతికర్త యనికాని లేదు. ఏమైనను భట్టనారాయణుఁడు, వంగీయుఁడుమాత్రము కాఁడనియు రాజాహ్వానమునఁ బరదేశమునుండి వచ్చి వంగదేశమున వసించిన యోగ్యపురుషుఁడనియు దీనివలన మనకుఁ దెలియవచ్చుచున్నది.

భట్టనారాయణుఁ డన్నను నారాయణభట్టన్నను ఒక్కనిపేరే కాని యిరువురిపేళ్లు కావు. క్రీ. శ. 1463 ప్రాంతమునకుఁ జెందిన వల్లభదేవుఁడు "సారంగధర పద్ధతిలో" ఆఱు శ్లోకము లుదాహరించి అవి "నారాయణభట్టు వేణీసంహారములోని"వని పేర్కొనెను. ఇందలియొక్క శ్లోకము నాతఁడే తన "సుభాషితావళి"లోఁ జేర్చి "భట్టనారాయణుని వేణీసంహారమునందలి"దని పేర్కొనెను. మఱియు, నీతఁడే "సుభాషితావళి"లో నింకొకచోట నుదాహరించిన యీ శ్లోకముక్రిందనే "నారాయణస్య" అని యుల్లేఖించెను. మఱియొకచోట "నిశానారాయణస్య" అని పేర్కొనెను. ఈ శ్లోకములన్నియు వేణీసంహారనాటకమునఁ గలవు. అందుచే నారాయణ

భట్టు, భట్టనారాయణుఁడు, నారాయణుఁడు, నిశానారాయణుఁడు అను నాలుగు పేళ్లు వేణీసంహార కృతికర్తకుఁ గలవని స్పష్టము.

నారాయణభట్టనామము నన్నయకు భారతరచనమునఁ దోడ్పడిన మహామహుఁడగు వ్యక్తిని మనకు స్ఫురింపఁజేయక మానదు. నందంపూఁడి శాసనమునుబట్టి నన్నయకు సాయపడిన నారాయణభట్టు "సంస్కృత కర్ణాటప్రాకృతపైశాచికాంధ్ర" భాషలలో "కవిరాజశేఖరప్రథితుఁ"డగు "సుకవిత్వవిభవుఁడు" "కవీభవజ్రాంకుశ నామసార్థుఁడు" అంతేకాదు. "తస్మై సకలజగదభిగుణశాలినే సరస్వతీకర్ణావతంసాయాష్టాదశావధారణ చక్రవర్తినే భట్ట(నన్ని)నారాయణా భవద్విషయే నందమపూణ్డీనామ గ్రామోగ్రహారీకృత్య..." అన్న వాక్యములవలన నారాయణభటు సకల జగదభిగుణశాలి, సరస్వతీకర్ణావతంసము, అష్టాదశావధారణ చక్రవర్తి; మఱియు నీతనికి భట్టనారాయణుఁడు నన్నినారాయణుఁడు నను పేళ్లు గలవు.

వేణీసంహార కృతికర్తయగు భట్టనారాయణునకు నారాయణ భ[illegible]నుపేరు గలదని పైని జూచితిమి. నన్నయకు భారతరచనమున సాయపడిన మహాకవి నారాయణభటునకు భట్టనారాయణుఁడను పేరు గలదని యిపుడు చూచితిమి. ఇరువురును మహాపండితులు, మహాకవులు నని తెలిసి కొంటిమి. భట్టనారాయణుఁడు మహాభారత కథను "వేణీసంహార" మను పేర నాటకముగా రచించెనని చూచితిమి. నారాయణభటు కన్నడమున భారతము రచించెనని వింటిమి. ఈ నారాయణభట్టే నన్నయకు ఆంధ్ర భారతరచనమునఁ దోడ్పడెనని నన్నయవలననే గ్రహించితిమి.

నిశానారాయణుఁడన్న యీతనినామ మెటు వచ్చినదో తెలిసికొన వలసియున్నది. నన్నయ భారతమున:

"పాయక పాకశాసనికి
భారతఘోరరణంబునందు నా
రాయణునటు దానును ధ
రామరవంశవిభూషణుండు నా
రాయణభటు వాఙ్మయధు
రంధరుఁడున్ దన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమ
తంబుగఁ దోడయి నిర్వహింపఁగన్."

అని కలదు. ఈ పద్యమందలి "తానును" అన్నచోట "మారస" "వానస" "తానిసి" "తానిశి" మున్నగు పాఠములు తాళపత్త్రి గ్రంథములలో లభించుచున్నవి. నారాయణభట్టు గృహనామము "వానస" అని ఆంధ్రకవితరంగిణీ కృతికర్త (పుట 128. సంపుటము 1.) యూహించెను. ఇట "తా నిసిధరామర వంశవిభూషణుండు" అను పాఠమును మనము గ్రహించిన యెడల నారాయణభట్టు నింటిపేరు "నిసి"వా రనియు దాని సంస్కృతీకరణము పూర్వము పేర్కొన్న "నిశానారాయణస్య" అనుటకు హేతువనియు మనము గ్రహింపవలసియున్నది.

వీనినిబట్టి ఈ యిరువురును భిన్నవ్యక్తులు కారు. భట్టనారాయణుఁడే నారాయణభటు. నారాయణభట్టే భట్టనారాయణుడు అని మనకుఁ దోఁచుచున్నది.

క్షితీశవంశావళీచరితము ననుసరించి ఆదినారాయణుఁ డనురాజు వంగదేశమును బరిపాలించినకాలము ౯౯౯ శతాబ్దమని కలదు. అనఁగా నది క్రీ. శ. 1077 ప్రాంతము. నందంపూఁడి శాసనము ననుసరించి నారాయణభట్టుకాలము క్రీ. శ. 1060 ప్రాంతము. సంస్కృతాంధ్ర కర్ణాట పైశాచికాది భాషలలో మహాపండితుఁడు మహాకవియై సంస్కృతమున "వేణీసంహార నాటకము"ను, కర్ణాటభాషలో భారతమును రచించి ఆంధ్రభారతరచనమున న్నయకుఁ జేదోడు వాదోడైన నారాయణభట్టే దేశసంచారము గావించుచు

వంగదేశమున కాహూతుఁడై యేఁగి తనయోగ్యతచే రాజును మెప్పించి పంచగ్రామములను బహుమానమును బడసి యుండవచ్చు నను నూహ పొడముచున్నది.

వేణీసంహారశ్లోకము లుదాహరించిన భోజదేవుఁడు (క్రీ. శ. 1005-1075 క్షేమేంద్రుఁడు (క్రీ. శ. 1025-1075) మమ్మటాచార్యుఁడు (క్రీ. శ. 1105) విశ్వనాథుఁడు (క్రీ. శ. 1150) మున్నగు వారి కాలమును బట్టి వేణీసంహారకృతికాలము క్రీ. శ. 1050 ప్రాంతమనవచ్చును. తత్కర్త నారాయణభట్టు నన్నయ సహాధ్యాయి యనుట కభ్యంతరము లేదు.

కాని, ఈ నిర్ణయమునకుఁ గొన్ని ప్రతిబంధకములు గలవు. వేణీసంహారశ్లోకము లుదాహరించిన వామనాచార్యుఁడు (క్రీ. శ. 750-800) ఆనంద వర్ధనుఁడు (క్రీ. శ. 840-870) ధనంజయుఁడు (క్రీ. శ. 950( క్రమముగా క్రీస్తుశకము ౮, ౯, ౧౦ శతాబ్దములకుఁ జెందినవారు. వీరి కాల నిర్ణయములపై నింకను వాగ్వాదములు జరుగుచునే యున్నవి. జూలియరు గ్రిల్లుదొర వేణీసంహారము క్రీ. శ. 5, 6 శతాబ్దములలో బయలువెడలిన దనెను; విల్సనుపండితుఁడు క్రీ. శ. 8, 9 శతాబ్దములలో వెలసిన దనెను. మాక్సుముల్లరు భట్టనారాయణుఁడు బాణుని సమకాలికుఁ డనెను. అందుచే వేణీసంహారరచనాకాల మిదమిత్థమని తేలలేదు.

సూత్రధారోక్తియందు "భట్టనారాయణస్యకృతం అభినవం వేణీసంహారనామనాటకం ప్రయోక్తు ముద్యతాః స్మః" ('భట్టనారాయణ స్యాభినవంకృతిమ్' అని పాఠాంతరము) అని యుండుటచే భట్టనారాయ ణుఁడు వేణీసంహారమునే కాక యితర గ్రంథములఁ గొన్నిటి నంతకుఁ బూర్వమే రచించియుండెనని తోఁచుచున్నది.

## 2. మూలకథయందలి మార్పులు : వాని ప్రయోజనములు.

1. ప్రథమాంకమున భీముఁడు కోపపరవశుఁడై సంధి యెంత మాత్రము జరుగరా దనుకొనుచుండఁగా దుర్యోధన సతియగు భానుమతిచే

నవమానితమైన ద్రౌపదీ భీమునికడకు వచ్చినట్లున్నది. భారతమున నీవిష యము లేదు. భీమునికోప ముద్రేకింపఁజేసి తన్మూలమున వీరరౌద్రరస పోషణముఁగావింప దలఁచి కవి యీ మార్పుచేసెను. రక్తసిక్తహస్తము లతో ద్రౌపదిసిగ ముడివేయుదునని భీముఁడు శపధముచేయుటకు, దాని మూలమున 'వేణీసంహార'మను నామము దీనికిఁ గలుగుటకు ఈ కథాపరి వర్తనము కారణమైనది.

2. ఇందు పాండవులకై దూతవచ్చినచో సంధి జరుగువని చెప్పు టకు శ్రీకృష్ణుఁడు రాయబారిగా వెళ్ళినట్లు కలదు. భారతమున నీవిషయమున రాయబారము నడపినది సంజయుఁడు. ఐదూళ్ళయంతరార్థమును దెలియఁ బఱచుటకును, శ్రీకృష్ణసంజయరాయబారముల సారమును క్లుప్తపఱచుటకుఁ గవి యీమార్పుచేసి స్వారస్యముఁ బెంచెను.

3, ఇందు దుర్యోధనుఁడు శ్రీకృష్ణుని బంధింపఁ దలపెట్టఁగా కృష్ణుఁడు విశ్వరూపమును జూపి యాతని ప్రయత్నమును భంగపఱచిన ట్లున్నది. మూలభారతకథలో దుర్యోధనుని దుష్టసంకల్ప మెఱింగి ధృత రాష్ట్రుఁడు దుర్యోధనుని నిందించుటయు, శ్రీకృష్ణుఁడు తనశక్తి దెలుపు టకై విశ్వరూపమును జూపుటయుఁ గలదు. ఈ మార్పుమూలమున విశ్వ రూప ప్రదర్శనమునకుఁ గార్యకారణసంబంధము చక్కఁగఁ బొసఁగినది.

4. రెండవ యంకమందలి భానుమతీస్వప్న వృత్తాంతము, భానుమతీ దుర్యోధన సమావేశసంభాషణములు మూలకథలో లేవు. భావికథను సూచించి కవి పతాకాస్థానమును గూర్చుటకు భానుమతీదుర్యోధనుల శీల చిత్రణముచేయుట కీ మార్పు గావించి యందమును తీసికొనివచ్చెను.

5. మూఁడవ యంకమునందలి ప్రవేశికలో హిడింబ యాజ్ఞ ననుస రించి రుధిరప్రియుఁడు భీమునిలోఁ బ్రవేశించి దుశ్శాసనునిరక్తము పానము చేసెనని కలదు. ఈమార్పు భీముని రక్తపానదోషమునుండి విముక్తునిఁ జేయుటేకాక హిడింబకు భీమునిపైఁగల గౌరవము వెల్లడిచేసినది.

6. భీష్ముఁడు తన్నర్ధరథునిగాఁ బరిగణించెనని కోపించి కర్ణుఁడు

భీష్ముఁడు చచ్చువఱకు నస్త్రసన్న్యాసము చేసెనని భారతమునఁ గలదు. మఱియు, కర్ణుఁడు తనబలమును పొగడుకొని పాండవుల సంహరించెదనని గర్వోక్తులు పలుక, కృపాచార్యుఁ డాతనియుత్తరగోగ్రహణపరాజయము స్మృతికిఁ దెచ్చి నిందింపగాఁ గర్ణుఁ డలిగి యింకొక మాఱుమాట యన్న నాతనినాల్కఁ గోయుదు ననెను. అది విన్న యశ్వత్థామ కత్తి దూసి కర్ణునిపై కుఱుక కృప దుర్యోధనులు వారిని వారింతురు. ఈ కలహము భారతమున ద్రోణవధకుఁబూర్వమే జరిగినది. ఈనాటకమున కర్ణాశ్వత్థామల కలహము ద్రోణవధానంతరము కర్ణుని దుష్టవ్యాఖ్యానముమూలమునఁ గలిగినది. ఈకలహపర్యవసానముగా కర్ణమరణపర్యంతము అశ్వత్థామ యస్త్రసన్న్యాసము చేయును. ఇందు రౌద్రరసపోషణ మద్భుతముగా నిర్వహింపఁబడినది.

7. భారతమున అభిమన్యుని పరాక్రమవధలు విపులముగా వర్ణితములు. ఈనాటకమున వృషసేనుపరాక్రమ వధలు విపులముగ వర్ణితములు. కృష్ణార్జునులు దగ్గఱ లేని సమయమును జూచి కర్ణాదులెల్లరుఁ గలిసి యక్రమముగా నభిమన్యుం జంపిరి; దీనికిఁ బ్రతిగాఁ గర్ణాదుల సమక్షముననే యర్జునుఁడు వృషసేనుని వధించినరీతిని వర్ణించి నాటకకర్త పాండవ ధర్మ ప్రాబల్యమును బ్రదర్శించెను.

8. భారతములో శాంతిపర్వమున గాంధారీధృతరాష్ట్రాదులు దుర్యోధనుని మరణానంతరము యుద్ధభూమికి వచ్చినట్లు గలదు. వేణీసంహారమున గాంధారీధృతరాష్ట్రులు యుద్ధభూమియందున్న దుర్యోధనునిఁ జూడవత్తురు. నాటక కర్త చేసిన యీమార్పు కరుణ రస ప్రతిపాదనకు మిక్కిలి తోడ్పడినది.

9. ఈసమయముననే భీమార్జునులు గాంధారీ ధృతరాష్ట్రులను దర్శించినటు భారతమున లేదు. ఈనాటకమున భీమార్జును లాసమయమున వారిని దర్శించి యాడిన యెత్తిపొడుపు మాటలు వారల నొప్పించుటకు దుర్యోధన భీమసేనుల వాక్కలహమునకు వీరరసమునకుఁ బోషకములైనవి.

10. భారతకథలో దుర్యోధనుఁడు భయముచే ద్వైపాయన హ్రదమున దాఁగుకొనెనని కలదు. కాని, వేణీసంహారమున షష్ఠాంకారంభమున భీముఁ డొనాఁడు దుర్యోధనుని వధింపలేనిచో నాత్మహత్యఁ జేసికొందునని చేసిన ప్రతిజ్ఞను విని తండ్రిప్రేరణమున దుర్యోధనుఁడు తాను ప్రొద్దుగ్రుంకువఱకు దాఁగికొన్న భీముని ప్రతిజ్ఞ వ్యర్థమై యాతఁడు చచ్చుననియు నాతనితో నాతని సోదరులు చత్తురనియుఁ దనకు శత్రునాశనము సుకరముగా నగునని యెంచి ద్వైపాయనహ్రదమున దాగుకొనెనని కలదు. దీనివలన భీముని సాహసపరాక్రమములు, ప్రతిజ్ఞాపాలనము వెల్లడియైనవి. మఱియు, భీముని పరాక్రమశీలములను వ్యక్తపఱచుటకై దాఁగియున్న దుర్యోధనుని భీముఁడే క్రోధవచనములఁ బిలిచినట్లు నాటకమునఁ గలదు. మూలమున ధర్మరాజుఁడు సాత్త్వికవచనముల దుర్యోధనుని బిలిచినట్లు కలదు.

11. చార్వాకవృత్తాంతము భారతమున ధర్మరాజ పట్టాభిషేక సమయమునఁ గలదు. ఈనాటకమున చార్వాకుఁడు ధర్మజుని వంచించి యాతని దుఃఖములకుఁ గారకుఁడైనట్లు కలదు. ఈమార్పువలన అద్భుతరసము, విమర్శ సంధియందుఁ జక్కఁగా నిర్వహింపఁబడినది.

12. భానుమతీదుర్యోధనుల శృంగార ప్రసంగము మూలమున లేదు. నాటకద్వితీయాంకమున నిది గలదు. దీనికిఁ గారణము ప్రతినాయకుఁడైన దుర్యోధనుఁడు అకారణముగా పతివ్రత యగు భార్యపై ననుమానించువాఁడు, గర్వియై

శత్రుబలములు లక్ష్యము చేయనివాఁడు, స్వబలవినాశనము నకు విచారింపనివాఁడు. యుద్ధసమయమున భార్యతో శృంగా. రాలాపము లాడువాఁడు, భార్య హితమును గైకొననివాఁడు, దుష్టులగు సోదరుల యల్పశక్తిపై నధిక భావము గలవాఁడు, నని యాతనిని సర్వదుర్గుణునిఁగాఁ జూపించుటకే. మఱియు, భానుమత్యంక మనఁదగిన ద్వితీయాంకమునఁ బ్రతినాయక పాత్రపోషణ మత్యద్భుతముగ నిర్వహింపఁబడుటేగాక, రాఁబోవుకథను ధ్వనిచే సూచించుటయను మహోత్కృష్టగుణ మున కీయంకము స్థానభూతమైనది. ఒక నకులము నూఱు పాములను మ్రింగుట యను భానుమతీస్వప్న వృత్తాంతము భవిష్యత్కథను సూచించినది. అన్వయభేదమున కంచుకితో మాటాడు దుర్యోధనునిచే నమంగళ వాక్యముఁ బలికించి రాఁబోవుప్రమాదమును నాటకకర్త సూచించెను. ఇట్లే 'ఊరు యుగము' 'భగ్నము' 'భగ్న' మనువాక్య సందర్భమున నీ నాటకకర్త యద్వితీయప్రజ్ఞ పారముఁ గన్నది. ఇన్నివిధముల భానుమతీవృత్తాంతము నాటకమున నెన్నికగన్నది.

## 3. వేణీసంహారము : రసము

వేణీసంహారము కరుణరసప్రధానమనియు రౌద్రరసప్రధాన మనియు వీరరసప్రధాన మనియు మూఁడువాదములు గలవు.

తృతీయాంకమున ద్రోణుని మరణవార్త విని అశ్వత్థా మయు, చతుర్థాంకమున వృషసేనునివధ యెఱిఁగి దుర్యోధ నుఁడు, పంచమాంకమున దుశ్శాసనాదుల చావు విని గాంధారీ

ధృతరాష్ట్రులును, షష్ఠాంకమున అసత్య భీమమరణమునకై యుధిష్ఠిరాదులు దుఃఖించిన కారణముననను, ఈనాటకమునఁ గరుణారసము ప్రధానమని డాక్టరు గజేంద్రఘట్కరు అభిప్రాయపడెను.

కాని, నవరసభరితమగు నీనాటకమునఁ గరుణరసముకూడఁ బోషింపఁబడినమాట సత్యమే. అంతమాత్రమున నిం దది ప్రధానరసమన వీలులేదు. కారణము లివి:—(1) వీరరౌద్ర రసములు కరుణారసము నతిశయించి యిందున్నవి. (2) 'వేణీసంహార' కథకు కరుణరస మెంతమాత్రము సహాయకారి కాదు. (3) కథానాయకుఁ డనఁదగిన భీమునకుఁ గరుణారసమునకు నెచ్చటను బొత్తు కుదురదు. (4) కథానాయ కేతివృత్తములతో రసమున కవినా భావసంబంధముండి తీరవలయును. కరుణరసమున కది యిందు లేదు.

ఇఁక, రౌద్రరసము ప్రధాన మనువాదముఁ బరిశీలింతము. ఈవాదమును బెక్కు రంగీకరించిరి. రౌద్రరసమునకు స్థాయి భావము క్రోధము. ఈక్రోధము నాటకమునం దెల్లెడలఁ గానవచ్చుచున్నది. కనుక, నాటకము రౌద్రరసప్రధానమని యనవచ్చును. కాని,

"వీరశ్శృంగారయో రేకః ప్రధానం యత్ర వర్ణ్యతే
ప్రఖ్యాతనాయకోపేతం నాటకం తదుదాహృతం"

"నాటకే ప్రఖ్యాత మితివృత్తం, ధీరోదాత్తో నాయకః, శృంగార వీర రసయోరన్యతరస్య ప్రాధాన్యం, అన్యేషాం

రసానా మంగ త్వేనానుప్రవేశః" అని యుండుటచే నాటకము నకు శృంగారవీరములలో నొకటి ప్రధానరసమై యుండితీర వలయునని శాసనము. కాన, నిది రౌద్రరసప్రధాన మునరాదు.

వేణీసంహారము వీరరసప్రధానము. దీని కుత్సాహము స్థాయి భావము. ధర్మమూలమగు నర్థకామములు గలిగి ధర్మ ప్రధానమైనదే వీరరసము. లోకోత్తరకార్యము లొనర్చుటయం దతిస్థిరమైన ప్రయత్నమే ఉత్సాహము. కాని. యీనాటక మున వీరమునకు స్థాయిభావము క్రోధముగాఁ జూపఁబడినది. "శత్రుకృతాపచారేణ మనఃప్రజ్వలనం క్రోధః" అని ప్రతాప రుద్రీయము.

దానవీరము, ధర్మవీరము, యుద్ధవీరము, దయావీరము నని వీరరసము నాలుగువిధములు. ఇందు ధర్మజుని వీరము ధర్మ వీరము. భీమార్జునాదులది యుద్ధవీరము. ఇవి కాక, నవరసము లును ఈనాటకమునఁ జక్కఁగాఁ బరిపోషితములు. వీరమే ప్రధానరసము.

## 4. వేణీసంహారము : నాయకుఁడు

నాయకగుణము లివి.

"మహాకులీనతౌజ్జ్వల్యం మహాభాగ్య ముదారతా
తేజస్వితా విదగ్ధత్వం ధార్మికత్వాదయో గుణాః"
"యశఃప్రతాపసుభగో ధర్మకామార్థతత్పరః
ధురంధరో గుణాఢ్యశ్చ నాయకః పరికీర్తితః"

నాయకుఁడు ధీరోదాత్తుఁడు ధీరోద్ధతుఁడు ధీరలలి తుఁడు ధీరశాంతుఁడు నని నాలుగువిధములు.

ధీరోదాత్తుఁడు: మహాసత్త్వోతిగంభీరః కృపావా నవి కత్థనః." మఱి ధీరోద్ధతుఁడు: "దర్పమాత్సర్యభూయిష్ఠ శ్ఛండ వృత్తి ర్వికత్థనః, మాయావీ సులభక్రోధ స్స ధీరోద్ధత ఉచ్యతే." వేణీసంహారమున యుధిష్ఠిరుఁడు ధీరోదాత్తుఁడు; ప్రతివీరుఁడగు దుర్యోధనుఁడును కౌంతవులకు భీముఁడును ధీరోద్ధతులు.

వేణీసంహారమునఁ బ్రధాననాయకుఁ డెవఁ డన్నది పెద్ద సమస్య. కార్యఫలానుభవకర్త, భరతవాక్యోచ్చారకుఁడు సాధారణముగా నాయకుఁ డగును. ఈ లక్షణములను బట్టి యుధిష్ఠిరుఁడు నాయకుఁడు. కాని, యుధిష్ఠిరునిలోఁ గల కొన్ని దుర్బలత్వములఁబట్టి భీమసేనుఁడే నాయకుఁ డని కొంద అను చున్నారు. కథాదిమధ్యాంతములు భీమునిమీఁదనే యాధా రపడియున్నవి. ప్రతినాయకుఁడగు దుర్యోధనుని మరణ మీతని వలననే యైనది. కాని, ధర్మజునికిఁగల ఉదారత, విదగ్ధత, ధార్మికత్వము నీతనికి లేవు. ఇవి నాయక లక్షణములలోఁ బ్రధానములు. జ్యేష్ఠుఁ డగుటను, ధర్మియగుటను, ఫలాను భవము నందినవాఁ డగుటను, భరతవాక్యముఁ బలికినవాఁ డగుటను యుధిష్ఠిరుఁడే నాటకనాయకుఁ డనక తప్పదు.

## 6. వేణీసంహారము: నామౌచిత్యము

ఈపే రీనాటకమున కెంతయో యుచితముగ నున్నది. ఎన్నిభావములనో మనమునఁ నిడుకొని కవి దీని కీనామ మిడి నట్లు తోఁచుచున్నది.

వేణీసంహార మనఁగా 1) సిగ విడివడుట (2) సిగ ముడి వడుట (3) (ద్రౌపది) సిగను స్పృశించుటవలననైన సంహా

రము చావు (4) (ద్రోణుని) సిగను బట్టి తలదీయుటవలననైన సంహారము (చావు) (5) వేణి కారణముగా జరిగినయుద్ధము. (6) మనోహరమైనవేణి కలిగిన ద్రౌపదియొక్క కథామాలిక.

"సాధ్వి ద్రౌపదిని పుణ్య సభన్ సిగఁబట్టి " (ప్రస్తావన. 9) "సతిని సిగఁబట్టి సభ నీడ్చి" (1-9) "విడివడిన వేణి తోడను వెలయు ద్రుపదతనయ" (1-10) "ఏమే! నీ మగలై దూళ్లు కోరుకొన్నారటకాదే! నీ వింకను సిగ ముడువవేమే!" (పుట 15.) "మీ మీ సిగలు విడివడకమునుపే మాదేవిసిగ యెట్లు ముడివేసికొనునే." (పుట 15.) "సుయోధను... వేఁడి వేఁడి నెత్తురు గొని చేతులన్ గురుల దువ్వి మెఱుంగిడి భీమసేనుఁడో, తరుణిరో చిక్కుదీసి ప్రమదంబొదవన్ ముడివేయు నమ్మమీ" (16 పుట.) "ద్రౌపదీవసన కేశాకర్షణ" (18పుట.) "కరమునఁ గొప్పువట్టి పయిగా నటు లీడిచి" (39) "కురుసభఁ బాండుపత్నినటు క్రూరరణంబున ద్రోణు నిట్టు లచ్చెరువుగఁ గేశసంగ్రహణశీర్షులఁ గంటిమి సిగ్గుచేటుగన్." (51)

"తొలి ద్రౌపది కేశగ్రహ, ఫల మనుభూతంబగుచునుండె బంధురముగ నిం, కిల రెండవ కేశగ్రహ, ఫల మనుభూతంబు నగును బ్రవినాశమునన్." (52) "తజ్జరాపలిత కేశౌఘంబు చేఁబూని" "మౌళిపయి న్యక్కారంబునం జేయివైచి" (55) "పితశీర్షమున్ దగులు శ్వానమొ కాకమొ ద్రౌపదుండో" "తత్పరమోత్తమాంగమును బాపీ! ముట్టఁగాఁ జాలినావా ?" (56) "గురునిశిరంబు ముట్టుటనె" (57) "గురునిజుట్టు పట్టుకొనిమె సకట" (61) "మత్పితన్ దలనున్ బట్టిన క్షత్త్రియాధముఁని మిత్త్రశ్రేణితోఁ గూల్చి" (62) "కురుసభలోన

నేపశువు కోమలి ద్రౌపది జుట్టుపట్టి (68) "ద్రౌపదిసిగముట్టి" (106) "కురుసభ కట్టు ద్రౌపదిని గొప్పువిదల్చుచు నీడ్చి తెచ్చి" (108) "పావనంబగు నీకేశపాశవితతి హస్తమునఁ బట్టి యీడ్పించినట్టి యలువ" 118 "భర్తలు చచ్చి కౌరవులపత్నులు కొప్పులు చేతఁబట్టి పెల్లార్తినిగాంతు లేఁదుటను నాటెను ద్రౌపది క్రోధవహ్ని" (120) "సతి వేణీ హారణోత్సవంబు" (123) "నాథా! భీమసేనా! నావేణి నీవే ముడివై చెదనంటివి" (131) "దుశ్శాసనహతకుఁడు విప్పివేసిన నా కేశపాశమును దుర్యోధనుని జంపిన రక్తముతోఁ దడిసిన చేతులతో నా నాథుఁడు ముడివేయవలయును" (133) "ఇదే దుర్యోధన దుశ్శాసన రక్తముతోఁ దడిసియున్న చేతులతో దుశ్శాసనుఁడు విడఁగొట్టిన పాంచాలి కేశపాశమును ముడివేయవలయును. ఐన సత్వరమే కానిమ్ము. ఆతపస్వినికి వేణీసంహారమహోత్సవము జరుగుఁగాక"(148) "భీమ : (ద్రౌపదివేణిని ముడుచుచు) దుశ్శాసనునిచే విడివడి ధార్తరాష్ట్రులకుఁ గాళరాత్రియైన యీవేణి నిఁక నీవే ముడుచుకొనుము" (149) "దేవీ! యిదే యంతరిక్షచరులగు సిద్ధజనులు వేణీసంహారమహోత్సవమున నిన్నభినందించుచున్నారు"(150) మున్నగువాక్యము లాయాయర్థములను సార్థకమొనర్చుచున్నవి. ఇంత రసవద్ఘట్టముల ననుసరించి యింతమనోహరముగా నాటకనామౌచిత్యమును బాటించిన మహాకవు లరుదు.

వేణీసంహారకథ యంతయు :

"ఏ వేణిన్ ఖలుఁ డంటఁగాఁ గురుకులం బెల్లన్ నశిత్రంబుగాఁ
జావంగాంచెనొ పాండుపుత్రులమహాశౌర్యంబునన్ శత్రుకాం

తావేణుల్ విడిపోయె శాశ్వతముగా ధన్యుండు భీముం డిదే
యావేణిన్ ముడివేసెఁగాంతురిఁకసౌఖ్యంబుల్ ప్రజల్ రాజులున్." (149(

అన్న పద్యమున విస్పష్టమైనది.

## 7. వేణీసంహారము : అనువాదములు

అతిమనోహరమైన యీసంస్కృతనాటకమును మొదట 1886 లో కీ. శే. వడ్డాది సుబ్బారాయుఁడుగారు, తరువాత కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును దీని ననువదించి ప్రకటించిరి. ఈ వేణీసంహార కథను గ్రహించి సంగ్రహముగను స్వతంత్రముగను వేణీసంహార మను పేరితో కీ. శే. కొడాలి సత్యనారాయణరావుగారు వ్రాసిరి. ఆ తరువాత 1951 లో దీనిని నే ననువదించి ప్రకటించితిని. ఇది దీని చతుర్థ పరిష్కృత ముద్రణము.

## 8. వేణీసంహారము : కృతజ్ఞత

ఇది పెక్కు విశ్వవిద్యాలయములలోను, మన విశ్వవిద్యాలయములోను బి.ఏ; ఎం.ఏ; పరీక్షలకుఁ బాఠ్యగ్రంథము. దీని నిట్లాదరించిన ఆయా యధికారు లెల్లరకు నేను మిక్కిలి కృతజ్ఞుఁడను.

సూచన:—౧ పుట ౧౪ పంక్తి 'ఒప్పారన్' ౨౫ 'జేర్వ' ౧౬-౭ 'స్వానధీరత' ౨౩-౧౯ 'చెప్పెదనులే' ౭౦-౭ 'శరవర్షము' ౧౦౮-౧౭ 'కొప్పువిదల్చుచు' ౧౨౦-౧౮ 'తద్భర్త' ౧౫౭-౨౧ 'శ్రీసంపన్నత' అని సరిదిద్దుకొనునది.

కాకినాడ,
10—6—65.

ఇట్లు,
బులుసు వేంకటేశ్వరులు.

ఇ. వ



విద్వాన్ : బులుసు వేంకటేశ్వరులు. ఎం. ఏ.,

శ్రీ ర స్తు

# వే ణీ స ం హా ర ము

## నా ం ది

శ్రీదామోదరుఁ డీసమస్తభువన
  శ్రేణీమహాధారనా
భీదేశుండు స్వనాభిరంధ్రవిలస
  ద్విశ్వావళీబీజుఁడున్
ప్రాదుర్భావబహుప్రపంచనిజగ
  ర్భన్యస్తశక్తుం డవి
చ్ఛేదానందకరుండు మీ కొసఁగుతన్ !
  శ్రేయంబు లెల్లప్పుడున్, ౧

శా. క్షీరాంభోనిధిమధ్యమందు గరిమన్
  శేషాహిపర్యంక మొ
ప్పారన్ వేతొకసంద్రమట్లు ఘనమై
  ల్యస్ఫూర్తి నద్దానిపై
శ్రీరంజిల్లఁగఁ బవ్వళించి మిగులన్
  జెల్వొందుచున్ సత్కృపా
ధారల్ చిందెడివిష్ణుదేవుఁడు జగ
  ద్భద్రుండు మి మ్మోముతన్!* ౨

---

* వల్లభదేవుఁడు "సుభాషితావళిలో"ఁ బేర్కొన్న
"ఉత్తిష్ఠంత్యా రతాంతే" అన్నశ్లోకమునకుఁ దెలుఁగు :

చ. రమణి రతాంతమం దొకకరంబును శేషునిమీఁద మోపి సం
భ్రమతఁ బటంబు నొండొకటఁ బట్టి వికీర్ణసుకేశభార మం
సముల వహింప శౌరి నవసంగమకాంక్షఁ గవుంగిలించి త
ల్పమునకుఁ జేర్చ శోభిలెడులక్ష్మి శుభంబులు మీ కొసంగుతన్!౩

ఉ. వారిత మైన దయ్యు నళి
పం క్తి కలంచె మరంద మెందు? వి
స్ఫారెనొ కుట్మలంబు లెవి
యా శశికాంతినొ నాఁగ? నట్టికం
సారిపదప్రకీర్ణకుసు
మాంజలిపూర్ణసుమంబు లీసభా
స్తారులనేత్రపర్వ మను
సంతతసిద్ధిని మా కొసంగుతన్ ! ౧

శా. కాళిందీపులినోర్వి రాధ పొలయ
ల్కన్ రాసమున్ మాని క
న్నీళుల్ కార రుషన్ వనిం జనునెడన్
వెన్వెంటఁ దత్పాదచి
హ్నాళిన్ ముత్పులకల్ జనింపఁ జని డా
యంగాంచి ప్రార్థించి యా
నాళీకాక్షిని దేర్చుకృష్ణునియనం
త స్తోత్ర మోమున్ మిమున్ ! ౨

చ. మయపురదాహ వేళ ముని
మండలి భ క్తిని గౌరి ప్రేమ శ్రీ
దయితుఁడు మందహాసమున
దైత్యసతుల్ చకితభ్రమార్తిఁ ద
ద్భయశమనప్రయత్నమద
దైత్యులు శస్త్రములన్ దివౌకసుల్
ప్రియతను దన్నుఁ గన్గొనఁగ
వెలిగెడి ధూర్జటి మిమ్ముఁ బ్రోచుతన్! ౩

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర : పలుపలుకు లేల ?

క. శ్రవణాంజలిపుటపేయం
బవునటు ఘటియించె భారతాఖ్యామృతమున్
భువి వ్యాసుఁడు రాగద్వే
షవిదూరుఁడు కొల్తునతని సరసపదంబుల్. ౧

పూజ్యు లగుసభాసదుల కిట్లు విన్నవించుకొందును.

క. మఱియొకకుసుమాంజలిగా
వఱలఁగఁ జేసెదము కావ్యబంధము నిందున్
గుఱి నళి మధుకణములె గొను
తెఱఁగున గుణలేశ మెంచి తృప్తింగనుఁడీ ! ౨

కవిసింహుఁ డగుభట్టనారాయణుఁడు క్రొత్తగా వేణీసంహార మను పేర వ్రాసిన సంస్కృతనాటకమును గవిప్రియుఁ డగు బులుసు వేంకటేశ్వరు లాంధ్రీకరింప దాని నిటఁ బ్రదర్శింప నున్నారము. కవి శ్రమపడి వ్రాసినాఁ డనికాని క్రొత్తనాటకము పోనీ చూత మనికాని కథావస్తువు చాల గొప్ప దని కాని దీనిని మీ రెల్లరు శ్రద్ధగాఁ జూడవలయును.

(తెరలో)

ఆర్యా ! త్వరగా. త్వరగా....వ్యాసనారదాదిమహర్షులతో భారత క్షేమముఁ గోరి తానే దూత యైనదేవకిబిడ్డఁడు దుర్యోధనుని శిబిరముఁ జేరువేళ కావున నిపుడు వాద్యమేళనముఁ గావింపుఁ డని పెద్దలయనుమతిని వీరు నటులతో ననుచున్నారు.

సూత్ర : (విని సంతోషముతో) ఆహా ! జగములన్నియుఁ బుట్టుటకు గిట్టుటకుఁ గారకుఁ డగుకృష్ణుఁడే కురుపాండవుల యుద్ధాగ్నిని జల్లార్చుటకు దూతయైనకారణమున నొక్క భరతకులమేకాదు సర్వరాజలోకము ధన్యముకదా :

(తెరలో)

ఇంకను గుశీలవులతో సంగీత మారంభింపరేమి ?

సూత్ర : సరే ఆరంభింతుము. ఏఋతువునుగూర్చి పాడుదుము ?

(తెరలో)

పండువెన్నెలలచే నిండి తారకలకాంతివెల్లువలచేఁ దెల్లనైన యాకాశముతోఁ గలస్వనముల నలసగతిఁ దిరుగు కలహంసలు క్రౌంచ పక్షులు మున్నగువానితో, ఏడాకులరఁటి, కలువ, తామర, తెల్లు, పువ్వులతోఁ దెల్లనైన సరస్సు లందలిపూలపరాగము నిండిన దిక్కులతో నొప్పుశరత్కాలమును గూర్చియే పాడుము.

సూత్ర : ఔను. ఈ శరదృతు వట్టిదే :

గీ. మధురగిరమయి సత్పక్షమంజులమయి
అతిమదోద్ధతప్రారంభమై ప్రసాధి
తాశమై ధార్తరాష్ట్రచయమ్ము నేలఁ
గాలవశమున నెంతయు వ్రాలునుగద ! 3

పారిపార్శ్వకుఁడు : (ప్రవేశించి) ఆర్యా ! పాపము శమించుఁగాక !

సూత్ర : (నవ్వుచు) శరదృతువును వర్ణించుపట్టున హంస లను నర్థమున ధార్తరాష్ట్రచయ మని వాడితిని.

పారి : కాని, నీమాటలోనియమంగళధ్వని నన్నుఁ గలఁచు
చున్నది.

సూత్ర : మారిషా! శ్రీకృష్ణుఁడు స్వయముగా సంధిదూతయగు
టచే నన్నియమంగళములు తొలఁగిపోవునులే :

చ. పగ యనునగ్ని చల్లఁబడ
వైరిగణంబు లణంగి పోవఁగా
నెగడుచుఁ బాండునందనులు
నీరజనాభునితో సుఖింప న
త్యగణితరక్తసాధితమ
హావనులై క్షతవిగ్రహత్వ మన్
వగను మునింగి కౌరవులు
బంధులతోడుత స్వస్థులయ్యెడున్ ! ౪

(తెరలో : తిరస్కారపూర్వకముగా)

ఓరి ! పాపీ ! దురాత్మా ! ముఖస్తుతిపాఠకా ! నటకాధమా ! నే
నుండఁగనే కౌరవు లెట్లు సుఖింతురురా ?

చ. కని ఖలవృత్తి లక్కయిలు
గాల్చి విషాన్నము పెట్టి జూదపుం
బెనుమిష రచ్చ కీడ్చి బహు
విత్తములన్ గొని మానభంగమున్
బొనరుప సాధ్వి ద్రౌపదిని
బుణ్య సభన్ సిగఁబట్టి చీర లూ
డ్చినఖలధార్తరాష్ట్రులు వ
సింతురె స్వస్థత నేను గల్గఁగన్ ? ౫

పారి: ఆఁ. ఆఁ. అది యేమి?

సూత్ర: (వెనుకకుఁ జూచి) కృష్ణుఁడు కౌరవులతో సంధిచేయఁ బోవుట కొల్లక భీమసేనుఁడు రౌద్రరసమూర్తియై కంటి కగపడిన వారి నెల్లర మ్రింగివేయునో యనునట్లు మహాకోపియై తమ్ముఁడగు సహదేవునితో నిటే వచ్చుచున్నాఁడు. అతని కంటికి మన మగపడ రాదు. మఱొకచోటి కేఁగుదము రమ్ము.

(నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

---

శ్రీరస్తు

# వేణీసంహారము

## ప్రథమాంకము

(కోపియై సహదేవునితో భీమసేనుఁడు ప్రవేశించును)

భీమ : ఓరీ! పాపీ! దురాత్మా! ముఖస్తుతిపాఠకా! నటకాధమా !

("కని ఖలవృత్తి లక్కయిలు గాల్చి .. " మరలఁ జదువును)

సహ : (అనునయించుచు) ఆర్యా ! శమింపుఁడు. ఈనటకుల వచనము మన కిష్టమేకదా ! ఏలన,

చ. "పగ యనునగ్ని చల్లఁబడ
వైరిగణంబు లణంగిపోవఁగా
నెగడుచుఁ బాండునందనులు
నీరజనాభునితో సుఖింప"

అన్నంతవఱకు మీ కభ్యంతరము లేదుకదా ! ఇంక ;

"అత్యగణితరక్తసాధితమ
హావను లై క్షతవిగ్రహత్వ మన్
వగను మునింగి కౌరవులు
బంధులతోడుత స్వస్థు లయ్యెడున్."

అనఁగా క్షతశరీరులై కౌరవులు సబంధుకముగా స్వర్గము నందుదురు గాక యనికదా భావము !

భీమ : (నిందాసూచకముగా) ఔనౌను. మీరు కౌరవుల కమంగళ మెన్నకుఁడు. పాపము వారు మీకు సోదరులుకదా ! సంధియే చేయుఁడు.

సహ : (కోపముతో) ఆర్యా !

గీ. మాటిమాటికి వైరంబు మనిచి పెనిచి
కయ్యమున కిట్లు కాల్దువ్వుకౌరవాళి
నెవఁడు క్షమియించు నీభ్రాత లిందఱందు
ధర్మజుం డట్లు వారింపఁ దలఁపకున్న ? ౧

భీమ : ఔను. అందుచేతనే మీకు నేను వేఱగుచున్నాను. నాకు:

ఉ. పిన్నతనంబునుండియుఁ బ్రి
వృద్ధము వైరము కౌరవాళితో
నన్న యుధిష్ఠిరుండు మఱి
యర్జునుఁ డీవును గారు కారకుల్
పన్నుఁడు మీరు సంధి మఱి
భగ్న మొనర్తును తత్క్షణంబు క్రో
ధోన్నతిఁ ద్రొత్తి మాగధమ
హోరము భగ్నమొనర్చినట్లుగన్. ౨

సహ : (అనునయముతో) ఆర్యా ! ఈనీ కోపముఁ గన్న నన్న ఖిన్నుఁ డగుఁగదా :

భీమ : ఏమి! అన్న ఖిన్నుఁడగునా! ఖేద మన్న నేమో యన్న యెఱుఁగనే యెఱుఁగఁడుగదా ! ఏలన ;

చ. కురుసభ నట్లు బన్నముల
గూరిన ద్రౌపదిఁ గాంచి వల్కలాం
బరు లగు వ్యాధులన్ గలిసి
వర్తిలి కాననభూములందు న
వ్విరటనృపాలుపాల నతి
విహ్వలతన్ బడియుండ నాపయిన్

గురునకు లేదు జాలి; కలు

గుంగద! కౌరవులందు నేఁటికిన్. ౩

అందుచే నీవు పోయి చిరకాలమునుండి పెరిగి పెంపుగన్న నాక్రోధపుఁబలుకు లామహారాజున కిట్లని విన్నవింపుము:

సహ: ఎట్లు?

భీమ: ఇట్లు!

మ. భవదాజ్ఞాపరిలంఘనాత్మకమహా

పాపంబె రాని మ్మిఁకన్

భవదీయాఖిలసోదరాధమమహా

పఖ్యాతి కానిమ్ము కో

పవిఘూర్ణప్రతిశోణితారుణగదా

పర్వంబుగాఁ ద్రుంతుఁ గౌ

రవులన్ నేఁడె తృణీకరింతు నిను నా

ర్యా! ఒక్కఁయినాఁటికే," ౪

(ఉద్ధతితో నడచును)

సహ: (భీమసేను ననుసరించుచు, తనలో) ఓహో! ఏమి! ఆర్యుఁడు పాంచాలి చతుశ్శాలలోనికిఁ బోవుచున్నాఁడు. నే నిట నిలిచెదను. (కూర్చుండును)

భీమ: (వెనుదిరిగి చూచి) సహదేవా! నీవు పొమ్ము, గురునితో నుండుము. నే నీయాయుధాగారమున కేఁగి సాయుధుఁడ నగుదును.

సహ: ఆర్యా! ఇది యాయుధాగారము కాదు. పాంచాలి వసించు చతుశ్శాల.

భీమ: (పరికించి) అట్లనా? సరే. పాంచాలితో మాటాడెదను.

(సహదేవుని చేయి పట్టుకొని) వత్సా ! అన్న యుధిష్ఠిరుఁడు కౌరవులతో సంధి కిచ్చగించి మన కెట్టిపీడ కలిగించినాఁడో !

(ఉభయులు ప్రవేశింతురు)

సహ : ఆర్యా! ఈయాసనమునఁ గూర్చుండుఁడు. కృష్ణ యిపుడే వచ్చును.

(ఇరువురుఁ గూర్చుందురు)

భీమ : వత్సా ! కృష్ణ యన్న జ్ఞప్తికి వచ్చినది. ఎట్టి పద్ధతులకు లోఁబడి సంధిచేయు మని యుధిష్ఠిరుఁడు కృష్ణభగవానుని దుర్యోధనునికడ కంపెను ?

సహ : ఆర్యా : ఐదూళ్ళు మన కిచ్చుటకు.

భీమ : (చెవులు మూసికొని) ఆహాహా! అన్న యజాతశత్రు వైనను నింతపరాక్రమహీనుఁ డని నిజముగా నామనసు కలఁగి పోయినది. సరిలే. ఈమాట నీవు చెప్పను లేదు. నేను వినను లేదు అనుకొందునులే. (ప్రక్కకుఁ దిరిగి)

గీ. ఉగ్రమును నూర్జితంబైన నొప్పుగన్న
క్షాత్రతేజంబు ధర్మరాజప్రసిద్ధుఁ
డితఁడు జూదము నాడంగ నెపుడు చేతఁ
బట్టెఁ బాచిక లప్పుడే వదలె వీని. 3

(తెరలో)

దేవీ : ఊఱకొను మూఱకొనుము.

సహ : (తెరవంకఁ జూచి తనలో) అయ్యో : ఏమిది ! ద్రౌపది యెడ తెగక క్రమ్ము కన్నీటితో నిటే యన్నసమీపమునకు వచ్చుచున్నది. ఏదో మహాకష్టము నుంచుకొని వచ్చుచున్నట్లే తోఁచుచున్నది.

గీ. అన్నకోపంబువలన నుత్పన్నమయ్యె
వైద్యుతాగ్నిగ జ్యోతి యీపగిది నిపుడె;
దానిఁ బెంపొందఁజేయు నీద్రౌపది యట
వర్షబుతువట్టు లీరీతి వచ్చి యిపుడు. ౬

(అంతఁ జేటి, కన్నీటితో ద్రౌపది, ప్రవేశింతురు.)

చేటి : దేవీ : ఊఱకొను మూఱకొనుము. నీ దుఃఖమును నిత్య కౌరవవిరోధి యగుభీమసేనకుమారుఁడు పోనడఁచును.

ద్రౌప : మహారాజు దీనికిఁ బ్రతికూలుఁడు కాకున్న.

చేటి : (చూచి) దేవీ ! భీమసేనుఁ డిటనే యున్నాఁడు. చెంత కేఁగుదము.

ద్రౌప : సరే.

(ఇరువురును సమీపింతురు)

చేటి : (చేరి) జయము జయము కుమారా !

భీమ : (చూడక)

"గీ. ఉగ్రమును నూర్జింత బన.... (మరలఁ జదువును.)

చేటి : దేవీ! భీమసేనుఁడు మిక్కిలి కోపముతో నున్నట్లున్నాఁడు.

ద్రౌప : చెలీ! ఐనచో నా కీతిరస్కారమే యూఱడింపు. ఇటనే కూర్చుండి నాథునియూహ యేమో తెలిసికొందుము.

(ఇరువురును గూర్చుందురు.)

భీమ : (క్రోధముతో) వత్సా ! ఏమి ! ఐదూళ్లకా సంధి ? ఔను!

చ. సమరమునందుఁ గోపమునఁ
జంపనుగా శతధార్తరాష్ట్రులన్ !
తమిమెయి దుస్ససేనునెదఁ
ద్రచ్చి కొనన్ రుధిరప్రవాహమున్ !

సమదగదన్ సుయోధన ని
షాదుతొడల్ పొడిసేయ! నౌ నిసీ!
శ్రమపడి రాజు సిగ్గు విడి
సంధియె చేసినఁ జేయని మ్మిఁకన్. ౭

ద్రౌప : (సంతోషముతో) నాథా! ఇట్టియమృతతుల్యము లగు మాటలు నే నెన్నఁడును వినలేదు. ఏది! యింకొకమా అనుము.

భీమ :
"చ. సమరమునందు....."(మరలఁ జదువును.)

సహ : ఆర్యా! మహారాజు సంధిసందేశ మంతగా నీకు నచ్చ లేదా?

భీమ : అస లాసందేశ మేమి!

సహ : రాజసందేశ మిది,

భీమ : ఎవరికి?

సహ : సుయోధనునకు. ఏమని యనఁగా,

క. పనుపడ నింద్రప్రస్థం
బనఁగ వృకప్రస్థమును జయంతం బనఁగా
ననునొప్ప వారణావత
మనఁగ నొసఁగి పిదప నొసఁగు మైదవ దేదేన్. ౮

భీమ : ఐన?

సహ : అన్న నాలుగే చెప్పి యైదవయూరు చెప్పకపోవుట విసపుఁగూడు, లక్కయింటికాల్పు, జూదపురచ్చ కీడ్చుట, చీర లొలుచుట యనున వెత్తిపొడుచుటకే.

భీమ : (సాటోపముగా) ఐనమాత్రము!

సహ : ఆర్యా! దీనివలన మహారాజుమనస్సు స్వకులక్షయ మన్న జంకున దనియుఁ గురురాజు సంధికామి కాఁ డనియును లోకమునకు విదిత మగును.

భీమ : ఈరెండు నర్థరహితములే. ఏలన, ఏనాఁడు మన మడ పులపాలయి కురుకులక్షయ మొనరింప శపథము పట్టితిమో యానాఁడే కౌరవులతోడి సంధి కారా దనియుఁ గురుకులము నశింపవలసియున్న దనియు లోకమునకుఁ దెలియును.

సహ : (సిగ్గుపడును)

భీమ : లోకమునఁ గురుకులనాశన మన్న మీ కింతలజ్జ యేల? ఏమిమూర్ఖత!

గీ. క్రోధమున శత్రుకోటిని ద్రుంచు టనఁగ
మీకు నగుఁబాటుగాఁ దోఁచు లోకమునను!
సతిని సిగఁబట్టి సభ నీడ్చి శత్రు వొకఁడు
వలువ లొలువఁగఁ గన నగుఁబాటు కాదు!

ద్రౌప : (జనాంతికముగా) నాథా! వీరికి సిగ్గు లేదు. నిజము సిగ్గు లేదు. నీవైన నామాట మఱవకుము.

భీమ : వత్సా! పాంచాలి రాదేమి?

సహ : ఆర్యా! ఆమె వచ్చి చాలసేపయినది. నీవు కోపావేశమునఁ గనవైతివి.

భీమ : (చూచి యాదరముతో) దేవీ! నే నీకోపసమయమున నీరాక యెఱుఁగనైతిని. దగ్గఱ నున్నను నిన్నుఁ గననైతిని. ఏమియు ననుకొనకుము.

ద్రౌప : నాథా! మీ రుదాసీనులై యున్న ననుకొందును గాని యిట్టి కోపసమయమున నున్న నెన్నఁడు ననుకొనను.

భీమ : సరే. నీ పరాభవము నేఁటితోఁ దొలఁగిన దని భావింపుము. (చేయి పట్టుకొని దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని ముఖము చూచి) దేవీ ! ఇట్లు విచారముతో నున్నావేమి ?

ద్రౌప : నాథా ! మీ దగ్గర నాకు విచార మెక్కడిది ?

భీమ : చెప్పవేమి ? (సిగ్గఁజూచి) ఇఁక, వేఱే చెప్ప నక్కఱ లేదులే.

గీ. పాండునందను లందఱు బ్రతికియుండి
సరసఁ గవగూడి యున్నఁ బాంచాలరాజ
తనయ సుమకోమలాంగి యుత్తమచరిత్ర
యిట్టి దురవస్థ నున్న దిం కేమి చెప్ప ! ౧౦

ద్రౌప : చెలీ ! నా సంగతి నాథునితోఁ జెప్పవే. నాయవమానమునకు విచారపడునా రింకొక రేరీ ?

చేటి : అమ్మా ! అట్లే. (అంజలిబద్ధయై భీమసేనునితో) దేవా ! దేవి కింతకన్న నెక్కువ యవమానకారణమే కలిగినది.

భీమ : ఏమేమి ! ఇంతకన్న నెక్కువయా ! చెప్పు. చెప్పు !

గీ. విడివడినవేణితోడను వెలయుద్రుపద
తనయ నెవ్వాఁడు ధూమరేఖను స్పృశించి
నటులు స్పృశియించి కురువంశ హరదవాగ్ని
కీలలకు శలభంబయి రాలు నుసిగ? ౧౧

చేటి : దేవా ! ఇంతకు ముందే దేవి యంబతోడను సుభద్ర మున్నగు సపత్నులతోడను బూజ్య యగు గాంధారికిఁ బాద వందన మొనరింప నేఁగి యుండెను.

భీమ : అది యుక్తమే. పెద్దలు వంద్యులేకదా ! తరువాతఁ దరువాత ?

చేటి : వెళ్ళి వచ్చుచుండఁగా భానుమతి దేవిని జూచినది.

భీమ : (కోపముతో) ఆఁ, శత్రుభార్య కంటఁ బడినదా ? అది దేవికిఁ గ్రోధస్థానమే. తరువాతఁ దరువాత ?

చేటి : అంత దేవిని జూచి యామె చెలికత్తెవైపు దిరిగి సగర్వముగా నవ్వి యిట్లనెను.

భీమ : చూచుటే కాదు. మాటకూడా నన్నదా ? ఏమి చేయుదుము ? తరువాత ?

చేటి : "ఏమే ! నీమగ లైదూళ్ళు కోరుకొన్నారఁట కాదే ! నీ వింకను సిగ ముడువ వేమే !" అని.

భీమ : సహదేవా ! వినుచున్నావుగదా !

సహ : ఆర్యా ! అది యట్లే. అది దుర్యోధనుని భార్య కాదా ! మఱి యిఁక నేమి ?

గీ. మగలసాహచర్యంబున మగువలకును
మాఱిపోవును గద ! మతి మగలవలెనె
విసపుఁజెట్టును బెనఁగొన్న వెనుక మధుర
వల్లియును మూర్ఛపుచ్చి చంపం గడంగు. ౧౨

భీమ : చేటీ ! దానికి దేవి యేమన్నది !

చేటి : దేవా ! నేను లేకున్నఁగదా దేవి పలుకుట ?

భీమ : సరే, నీ వేమంటివి ?

చేటి : "ఓసీ ! భానుమతీ ! మీమీసిగలు విడివడకమునుపే మాదేవి సిగ యెట్లు ముడివేసికొనునే ?" అని.

భీమ : (ఆనందముతో) సెబాస్. బుద్ధిమతీ ! సెబాస్. ఎంత చక్కఁగాఁ బలికితివే ! దీని కిదే నీకు నా పారితోషికము.

(అభరణ మిచ్చును) ఓ పాంచాలీ ! (అసనమునుండి లేచి) దుఃఖిం

పకుము. అచిరకాలముననే నేఁ జేయునది చెప్పెద వినుః

చ. గిరగిరఁ ద్రిప్పుకొంచు గద

కిన్క సుయోధనునూరుయుగ్మ ము

ద్ధురరభసంబునన్ జదిపి

తుత్తుమురై పడ వేఁడివేఁడినె

త్తురు గొని చేతులన్ గురుల

దువ్వి మెఱుంగిడి భీమ సేనుఁ డో

తరుణిరొ ! చిక్కుదీసి ప్రమ

దం బొదవన్ ముడివేయు నమ్ముమీ ! ౧౩

ద్రౌప : నాథా ! నీవు తలఁచినఁ జేయలేని దేది ? మీయన్న

దమ్ములు దయచూపవలయునే కాని.

సహా : అది మాకునైత మిష్టమే.

(తెరలో గొప్ప కలకలము. అంద ఱాశ్చర్యముతో విందురు)

భీమ :

సీ. ఘూర్ణాయమాన మౌఘోరవార్నిధిమధ్యఁ

జలియించుమందరాచలమునట్లు

కోణఘాతంబుచే గురుతరం బగుగర్జ

ఘర్షించుప్రళయ మేఘంబురీతి

పరమపాండవసతీచిరతరోగ్రక్రోధ

దుర్వార మౌనగ్రదూతభంగి

కౌరవ్యవంశసంక్షయనిమిత్తంబుగా

బయలుదేఱినచండవాయువుగతి

గీ. ధ్వానధీరత సంఘట్టచండతయును
నుగ్రనిర్ఘాతలక్షణం బొప్ప భీమ
సింహనాదానుకారి యీచెలువు తోఁప
విజయరణదుందుభిధ్వని వినుము వత్స! ౧౪

కంచు : (సంభ్రాంతుఁడై ప్రవేశించి) కుమారా! శ్రీకృష్ణభగవానులు....

(అందఱు కృతాంజలులై లేతురు)

భీమ : భగవానుఁ డెక్కడ?

కంచు : పాండవపక్షపాతి యనుకోపమున దుర్యోధనుఁ డాతనిని బంధింప దొరకొనెను.

(అందఱాశ్చర్య మందుదురు.)

భీమ : ఏమి! అతనిని బంధించిరా?

కంచు : లేదు. లేదు! అంతవఱకు వచ్చినది.

భీమ : అపుడు భగవానుఁ డేమి చేసెను?

కంచు : ఆమహాత్ముఁడు విశ్వరూపమును జూపి యా తేజమునఁ గురుకులము మూర్ఛవోఁగా మన శిబిరమున కరుదెంచి త్వరలో నిన్నుఁ గనఁ గోరుచున్నాఁడు.

భీమ : (నవ్వుచు) ఏమేమీ! దురాత్ముఁ డగు దుర్యోధనుఁడు భగవంతునే కట్టివేయఁ జూచినాఁడా? (ఆకాశముఁ జూచి) దురాత్మా! కురుకులపాంసనా! ఈమర్యాదాతిక్రమణమున నీ వినాశమునకు మాక్రోధ మిఁక నిమిత్తమాత్రమే యగునులే.

సహ : ఆర్యా! ఆ దురాత్ముఁ డపుడైనఁ గృష్ణుఁడే వాసుదేవుఁ డని గ్రహింపలేదు కాఁబోలును!

భీమ : వత్సా: మూఢుఁ డతఁ డెట్లు తెలిసికొనఁగలఁడు?

మ. స్థిరమై యొప్పెడినిర్వికల్పకసమా
ధిన్ బుద్ధులన్ నిల్పి దు
స్తరదుర్వారతమోగుణంబు విమల
జ్ఞానంబునన్ ద్రోచి యా
త్మ రముల్ కాంచెడి జ్ఞానమూ_ర్తిని దురా
త్మక్రూరదుర్మోహుం డా
కురురా జెట్లు గ్రహింప నేర్చుఁ ? గను వై
కుంఠాత్ముఁగాఁ గృష్ణునిన్ ? ౧౫

మైత్రేయా ! గురువు లిపు డేమి చేయుచున్నారు ?

కంచు : కుమారా ! నీవే వచ్చి యన్నియుఁ దెలిసికొనుము.

(నిష్క్రమించును)

(తెరలోఁ గలకలము. తరువాత)

ఓహో ! ద్రుపదవిరాటప్రభృతమహారాజులారా! సేనాపతులారా!
సైన్యప్రధానయోధులారా ! వినుఁడు.

మ. మును సత్యవ్రతభంగభీత మయి యొ
ప్పుం గాంచియున్ మందమై
ఘనవంశస్థిరశాంతిఁ గోరి యెటులో
కన్పట్టె లేనట్టులే
యన ద్యూతారణి ద్రౌపదీవసనకే
శాకర్షణన్ బుట్టి రాఁ
జినకౌంతేయక్రుధాగ్నియే కురువన
శ్రీఁ గాల్ప జృంభించెడిన్, ౧౬

భీమ : (విని సంతోషముతో) జృంభించుఁగాక ! జృంభించుఁగాక!
ఆర్యునికోపజ్యోతి తిరుగులేక వెలుఁగొంది ప్రజ్వరిల్లుఁగాక !

ద్రౌప : నాథా ! లయకాల మేఘధ్వనివలె భయంకర మైన రణ దుందుభి యిపు డనుక్షణ మిటు మ్రోఁగుచున్న దేల ?

భీమ : దేవీ ! ఏమియును లేదు. యజ్ఞ మొకటి జరుగుచున్నదిలే.

ద్రౌప : (ఆశ్చర్యముతో) ఏమి యజ్ఞము ?

భీమ : రణయజ్ఞము. ఎట్లన,

చ. నలువుర మేము ఋత్విజు ల
నన్, హరియే యుపదేష్ట; ధర్మజుం
డలరును సోమయాజి యయి,
యాదువు నీవును సోమిదమ్మవున్,
ఖలు లగుకౌరవుల్ పసులు,
కాంతపరాభవదుఃఖశాంతియే
ఫలము, నరాధిపాళిఁ బిలు
వంగను మ్రోఁగెడుఁ గీర్తిదుందుభుల్." ౧౩

సహ : ఆర్యా ! మనమును గురునాజ్ఞఁ గొని పరాక్రమము చూపుదము రమ్మా.

భీమ : వత్సా ! సిద్ధముగ నున్నాను. (లేచి) దేవీ! కురుకులనాశన మునకుఁ బోయి వచ్చెదము.

ద్రౌప : (కంట నీటితో) నాథా ! అసురులఁ జంపి వచ్చిన హరి వలె నీవును శత్రువులఁ జంపి వత్తువుగాక !

చేటి : దేవా ! మీరు రణరంగమునుండి విజయగర్వమున వచ్చి దేవి నూఱడింతురుగాక యని యామె యనుచున్నది.

భీమ : దేవీ ! ఏల యీవట్టి యూఱడింపులు.

గీ. పరిభవక్లాంతిలజ్జావిధురితముఖుని భీమ
నిరవశేషితకౌరవ్యనిఖిలనిచయు సంబంధించిన

నను వృకోదరు నింక నెన్నఁడును నీవు
చూడవు నిజంబు నమ్ముమీ సుందరాంగి! ౧౮

ద్రౌప: నాథా! నాకు జరిగినయవమానమువలన నీకుఁ గలిగిన కోపమున నేమాత్రము యుద్ధరంగమున నేమఱియుండకుము. రిపు లప్రమత్తులుగదా!

భీమ: దేవీ! మేము రణభీరులము కాము. సుక్షత్త్రియుల మేలే. ఏలన,

సీ. అన్యోన్యకోపాధికాస్ఫాలసంభిన్న
కరిరక్తమస్తిష్కకర్దమంబు,
ఆకర్దమంబున నత్యంతమగ్నమౌ
రథసమూహంబు, లారథసమూహ
ములపయిన్ గమియించు బలవంతులౌ పదా
తులగుంపు, వారి యుద్ధురరణంబు,
రక్తపానానంద రసదశివసృగాల
తూర్యనృత్యప్రబంధురకబంధ

గీ. మగుచు బీభత్సరసమున కాలవాల
మయిన సంగ్రామవార్ధిమధ్యప్రభీత
జలములందునఁ జరియించి జయముఁ గొంచు
పండితాఖండలుల్ సుమీ! పాండుసుతులు. ౧౯

(అందఱు నిష్క్రమింతురు)

ఇ ది

ప్రథమాంకము.

# విష్కంభము

కంచుకి : (ప్రవేశించి) "భానుమతీదేవి గాంధారీదేవికి వందన మొనరించి వచ్చినచో ముందామెను జూచి తరువాత నభిమన్యుని మరణమునకుఁ గారకులైన కర్ణాదులను బహూకరింపఁ బోవలయును. కావున, నామె వచ్చినదేమో చూచి ర" మ్మని దుర్యోధనమహారాజు నా కాజ్ఞాపించెను గదా ! ఇఁక నే నాలసింపరాదు. ఆహా ! ముదివగ్గ నయి కదలమెదల లేనినాకు నైత మింతపని కల్పించినది రాజాజ్ఞా బలముకదా! నావార్ధక్యదశ ననుకొనఁ బనిలేదు. అంతఃపురపరిచారకు లెల్లర కిట్టివేషచేష్టలు క్రొత్తవి కావుగదా !

చ. కనఁ గలశక్తి యున్నఁ గనఁ
గాదు, వినం గని చెప్పఁ గాదు, చే
తను దృఢగాత్రుఁడున్ గొలువు
దండము నూనక యుండఁ గాదు, లో
ననవరతంబు దత్తమన
మౌటఁ దడంబడుఁ గాళ్ళు, రాజసే
వను గల విన్నిపాట్లకట !
వచ్చెనె క్రొత్తగ వార్ధకంబునన్ ? ౧

(ముందు కేఁగి, ఆకసమువంకఁ జూచి) ఓసీ! విహంగికా ! దేవి యత్తమామలను సేవించి వచ్చినదా ? (చెవి యొగ్గి) ఏమనుచున్నావు ? వచ్చి మగనికి జయము కాలవయు నని నియమనిష్ఠలతో బాలోద్యానమునఁ గలదేవాలయములో నున్న దనియా ? సరే నీవు పోయి నీపని చూచుకో. నే నీసంగతి మహారాజునకుఁ జెప్పెదను. (ముందు కేఁగి) సతీమణీ ! మంచిది. మంచిది. మహారాజుకంటె

నీవే మెఱుఁగు. శ్రీకృష్ణభగవానునితోసైతము పాండవులు నెత్తిపై కెత్తి వచ్చినను రాజు పురవిహారము విడువలేఁ డాయె! (ఆలోచించి) స్వామిపను లేమియు బాగు లేవు. ఏలన, ఈతఁడు :

మ. మును శస్త్రాభ్యసనంబునుండియు మహా
మోఘాస్త్రుఁడౌ జామద
గ్న్యుని నోడించిన భీష్మభానుఁ డకటా !
కూలంగ నేడ్వండు; వీ
రవికాయంబును బెక్కు కూల్చి క్షణవి
శ్రాంతాత్ముఁ డౌబాలు నొ
క్కని బెక్కుర్విలు ద్రుంచి చంపఁ గని చం
కల్ కొట్టి నర్తించెడిన్ ! ౨

అన్నివిధముల దైవము మేలుచేయక కీడే చేయుచున్నాఁడు. కానిమ్ము. దేవి యిట నున్న దని పోయి మహారాజుతోఁ జెప్పెదను.

(నిష్క్రమించును)

ఇది విష్కంభము.

---

# ద్వితీయాంకము

[ఆసనమున భానుమతీదేవి-దగ్గఱగా సఖి సువదన, చేటి తరళిక ప్రవేశింతురు ]

సువ : భానుమతీ ! దుర్యోధనమహారాజు భార్యవై యుండి యీ మాత్రపుఁ బీడకల కింతగా వంత నొందుదు వేల ?

తర : దేవీ ! సువదన నిజము పలికినది. నిద్రించినవారికిఁ గలలు కలవరింతలు వచ్చుట లోకసహజముగదా !

భాను : చెలీ : ఇది సామాన్యపుఁగల కాదు. నిజముగా నిది యేదో కీడు తేఁ గల దనియే నాభయము.

సువ : అట్లైన నీకు వచ్చిన కల యేమో చెప్పు. మేము దానికిఁ దగిన విఱుగుడు లగునీవులచేతను నోములచేతను నేలవేల్పుల దీవనలచేతను నరిష్టములను బోఁగొట్టుదుము.

తర : సువదన యన్నది బాగున్నది. చెడ్డకలలైనను నోములు మున్నగు మంచిపనులచేఁ జెడ్డఫలము కాక మంచిఫలమే యిచ్చును.

భాను : సరే. చెప్పెదను. సరిగా వినుము.

సువ : ఊఁ. చెప్పు.

భాను : చెలీ ! నాకుఁ గలిగినవెఱపువలన నది మఱచిపోతినే. జ్ఞప్తికిఁ దెచ్చుకొని నెమ్మదిమీఁదఁ జెప్పెదనువే.

(దుర్యోధనుఁడు, కంచుకి, ప్రవేశింతురు)

దుర్యో : ఎవఁడు చెప్పినాఁడో కాని యీమాట దొడ్డమాట !

గీ. ఎదుటనైనను జాటుగానేని తానో
యొరులో యెవ్వరో కొలఁదియో యున్నతంబో
యైనయపకృతి పగవాని కమరఁ జేసు
నవిరళానంద మొందు నిక్కువము నరుఁడు. ౧

కావున, ద్రోణకర్ణసైంధవాదులచే నభిమన్యుఁడు చచ్చుటవలన నాప్రాణములకు హాయి కలిగినది.

కంచు : ఆచార్యు లగుద్రోణులయస్త్రశక్తి కిది గౌరవప్రదమా? కర్ణసైంధవులకుమాత్ర మిది యెంత కీర్తికరము ?

దుర్యో : ఒంటిగానిపై నంద ఱొక్క పెట్టునఁ బడి విల్లు విఱిచి చంపు టేటిన్యాయ మని కృష్ణుఁ డన్నాఁడుకదా ! మఱి !

క. ఖండనమున గాంగేయు శి
ఖండిని ముందుంచుకొనియెకా చంపిన దా
పాండవులు; వారి కది తగ
దండిమగల మైనమాకుఁ దగు నీయశమున్. ౨

కంచు : దేవా ! నీ విట్లు సరిపెట్టుకొనుట తగదు. నీపౌరుష మిట్లు కుంఠిత మగు నని మున్నెన్నఁ డనుకొనము. కావ, నట్లంటిని.

దుర్యో : ఓయీ ! నిజమే.

గీ. సేవకులతోడ బాంధవశ్రేణితోడ
భ్రాతృసుతమిత్రబహుళవర్గములతోడ
స్వీయబలముల నని యుధిష్ఠిరుఁడు కూల్చు
సత్యము సుయోధనుని, నింక జంక నేల ? ౩

కంచు : (చెవులు మూసికొని) పాపము శాంతించుఁగాక ! పాపము శాంతించుఁగాక ! అమంగళము ప్రతిహత మగుఁగాక !

దుర్యో : ఏమి ? నే నేమంటిని ?

కంచు : "గీ. సేవకులతోడ...." (అను పద్యము చదివి) యుధిష్ఠిరుఁడు సుయోధనుని గూర్చి నని విపరీతముగఁ బలికితివేల?

దుర్యో : భానుమతి నాతోఁ జెప్పక యెటకో లేచిపోయినది. అందువలన నామతి చలించినది. ఆమె యెట నున్నదో చూపుము.

కంచు : దేవా ! ఇటు. ఇటు.

(ఇరువురును నడతురు)

కంచు : (ముందు చూచి యంతటను సుగంధ మాఘ్రాణించి) దేవా ! చూడు. చూడు. మంచుతుంపరులచేఁ జల్లనైనయీయుదయ కాలపులేగాలులవలనను, గూళ్ళలో మేలుకొని శ్రుతిసుఖముగాఁ గలకలధ్వనులు చేయుచుఁ బక్షులు తమ ఱెక్కలు కదల్చుట వలనను, నిటునటు కదలుచుఁ దొడిమ లూడిపోవఁ దరువుల నుండి రాలిపడుచక్కని పువ్వులు పఱపులు కాఁగా హృదయంగమముగాఁ గమ్మతావులఁ జిమ్ము కుందపుష్పములసౌరభముతో నొప్పునీబాలోద్యానము !

ఉ. మాపుల విచ్చుపూవులను
మంచు మరందముఁ గ్రోలి సోలియున్
రేపటిప్రొద్దు భూమిపయి
ఱివ్వునఁ బూవులతోడ రాలి తా
మాపయి సూర్యకాంతి విరి
యంగఁ దొడంగుచుఁ గమ్మతావులన్
వ్యాపనచేయుపద్మముల
వ్రాలెడుఁ జూడుము చంచరీకముల్. ౪

దుర్యో : (బాగుగాఁ జూచి)ఇది మఱియు మనోహరముగా నున్నది!

చ. అరవిరిదమ్ము లంతటను

నల్లన నల్లన విచ్చువేళలన్

సురుచిరభానుహస్తములు

సోఁకినవేఁడిమి కుల్కి యాంద్రతో

నరపతిలీవి మేలుకని

నవ్యసుగంధ మనోహరంబులౌ

సరససరోజపత్త్రిమృదు

శయ్యల వీడెడు గండుఁదుమ్మెదల్.

కంచు : దేవా : సువదనయుఁ దరళికయు సేవింప దేవి యట నున్నది. చూడు.

దుర్యో : (చూచి) సరే. నీ వేఁగి రథమును సిద్ధము చేయుము. నేను దేవిని జూచి వచ్చెదను.

కంచు : చిత్తము. (నిష్క్రమించును)

సువ : నెచ్చెలీ ! మఱచిన కల జ్ఞప్తికి వచ్చినదా ?

భాను ! ఆఁ. వినుము. నే నీపూఁదోఁట గూర్చుండి యుండఁగా నొకచక్కని ముంగిస నూఱుపాములను జంపినది.

ఉభ : (తమలో) పాపము శమించుఁగాక! అమంగళము ప్రతిహత మగుఁగాక ! (ప్రకాశముగా) తరువాతఁ దరువాత ?

భాను : నామనస్సు కలఁగిపోయిన కారణమునఁ దరువాతి సంగతి మరల మఱచిపోతిని.

దుర్యో : సరి. సువదనాతరళికలతో దేవి యేదో మాటాడుచుఁ గూర్చున్నది. ఈగుబురుతీఁగలమాటున నుండి వీరిమాటలు విందును.

సువ : దేవీ! వగ లుడిగి తరువాత నేమి జరిగినదో చెప్పు.

దుర్యో : ఈమెవగ యేమోకదా! ఓహో! నాతోఁ జెప్పకే యిలు వెడలి వచ్చినదికదా! నాపైఁ గోపము వచ్చినదేమో? దేవీ! దుర్యోధనుఁడు నీకోపమునకుఁ దగనివాఁడుసుమా!

ఉ. కోమలి! నీవు బాహులతఁ
గూరిమిఁ గంఠముఁ జుట్టువేళ నే
నేమఱి త్రోసివేసితినొ?
యీవు ననున్ గనువేళ నిద్రచే
భామిని! మోముఁ ద్రిప్పితినొ?
పాడితినో కల నన్యకాంత? నే
నేమి యొనర్చితిన్ ప్రియ! య
నిష్టము దాసులముందుఁ దిట్టఁగన్? ౬

(ఆలోచించి) కాక :

గీ. పొలఁతిచిత్తంబు నాయందె నిలువఁబట్టి
యతిశయస్నేహసంబద్ధ మానసూయ
పెంచి యపరాధలేశ మూహించి దేవి
కుపితయై యుండఁబోలు నిక్కువపుఁ బ్రేమ. ౭

ఐన, నీమె యే మనునో విందునుగాక!

భాను : చెలీ! కాని, నా కాయతిశయదివ్యరూపనకులసందర్శనమునమాత్రము మిక్కిలిసంతోషము కలిగినది.

దుర్యో : ఏమి! అతిశయదివ్యరూపనకులసందర్శనమున సంతోషము కలిగినదా? అయ్యో! మాద్రీసుతుఁ డగునకులునియం దనురక్తయైనయీమెవలన నే నెంత మోసపోతిని!

(సోత్ప్రేక్షముగా "పొలఁతిచిత్తంబు...." అనుపద్యము మరలఁ జదివి)

ఓరీ! మూఢా! దుర్యోధనా! కులటావిప్రలబ్ధుఁడవై నీవు ని న్నెన్నివిధములుగానో మన్నించుకొంటివి. ఇపు డేమందువు?

("కోమలి! నీవు" అను పద్యమును మరలఁ జదివి దిశలు చూచి)

సరే. తెలిసినది. ఇందులకే కాఁబోలు నీమె కుదయముననే యేకాంతముగా నుండుటకుఁ గోరికపుట్టుట! సఖులతో సల్లాపించుట? మోహవశుఁడై దుర్యోధనుఁ డీమెహృదయము నెఱుఁగక మోసపోయెనుగదా! ఓపాపినీ! నాభార్యవయ్యుఁ గులట వైననిర్భాగ్యురాలా!

చ. అతివినయంబు చెంగటను;
నవ్వల నింతటిసాహసంబు, సం
స్తుతులు కుఱంగటన్ బ్రణయ
ముం గికురించెడువర్తనం బిటుల్,
నతులు సమీపమం దటు ల
నన్ వినరానికుచేష్టితంబు లీ
గతిని దురాత్మురాల! యిటు
కాల్తువె సత్కులకీర్తిచంద్రికల్? ౧౮

సువ: తరువాతఁ దరువాత?

భాను: అంత నే నిపుడు కూర్చుండియున్నతీఁగయిల్లు చేరి కూర్చుంటిని. న న్ననుసరించి యానకులకుమారుఁడు నిటకు వచ్చి కూర్చుండెను.

దుర్యో: ఆహా! ఈజారిణి కిటు చెప్పుకొనుటకు సిగ్గయిన లేదు? ఇది కులటకు సహజమేకదా! ఈమె:

గీ. అతి చిరంతన స్నేహభావాభివృద్ధి
నాత్మరతిభోగ మేకాంత మైనరీతి

నేచెలికిఁ జెప్పు నాచెలి కిట్లు తనదు
దుశ్చరిత్రను జెప్పంగఁ దొడఁగె నౌర ?

సువ. తర : ఏమ్మట ?

భాను : అంత నాతఁడు పొగరునఁ దనచేతితో నాపైఁటఁ దొలఁగించెను.

దుర్యో : (ఆలోచించి) ఇది చాలును. ఇఁక, విన నక్కఱలేదు. అగుఁగాక ! పరవనితలఁ బట్టుటలో నిట్లు నిపుణుఁడైన యానకులహతకునియసువుల నిదే తీసివేయుదును. (అడుగిడి యాలోచించి) లేక యీపాపశీలను ముందే కడతేర్తును. (మరలును)

సువ. తర : తరువాత ? తరువాత ?

భాను : సఖీ ! అంతట నార్యపుత్త్రునివేకువమేలుకొలుపులగు మంగళవాద్యములతోఁ గలిసిన వారకాంతల సంగీతముల చే నేను మేల్కొంటిని.

దుర్యో : (ఆలోచించి) ఏమి ? మేలుకొంటి ననుచున్నది. కలగన్నవిషయమా యిది ? (మరల నాలోచించి) సరే. సఖిమాటల వలన నిదియుఁ దేలఁ గలదు.

సువ. తర : (విచారముతో నొండొరులఁ జూచుకొందురు) (ప్రకాశముగా) దేవీ ! ఈయహితమును గంగానదీజలములవలనను, భగవానులగుబ్రాహ్మణుల యాశీర్వచనములవలనను, సప్తజిహ్వునకు హోమములు చేయుటవలనను బోఁగొట్టుకొందములే.

దుర్యో : సరి. సందేహ మేల ? కలగన్నవిషయమే యామె చెప్పినది. నేను మందబుద్ధినై వేఱుతెఱఁగున నూహించితిని. అదృష్టము.

మ. అరమాటన్ విని విప్రలంభజనితో
ద్యత్క్రోధినై పోవ లే
దరయన్ దక్కినమాటచే రుషను నో
రారంగఁ బల్కంగ లే
దు. రహిన్ దత్కథ పూర్తియయ్యె నిటు తో
డ్తో నేను నమ్మంగఁ: బు
ణ్యారమన్ గాంత మృషాకళంకమునఁ బా
యన్ లేదు జీవం బహో ! ౧౦

భాను : సఖీ ! ఈకన్నకలవలనిశుభాశుభములు చెప్పుము.

సువ. తర : (ఒకరి నొకరు చూచుకొని అపవారించి) ఇం దేమాత్రము శుభము లేదు. అసత్యము చెప్పరాదుగదా ! అది యపరాధమే యగును. పరుషమైనను బ్రియసఖులకు హితమే చెప్పవల యును. (ప్రకాశముగా). సఖీ ! నిజముగ నిది యంతయు నశుభ మునే సూచించుచున్నది. దేవతలదయవలన బ్రాహ్మణుల కృపవలన నిది తొలఁగిపోవును. కోఱలు గలజంతువును, ముంగిని, కోఁతిని గలలోఁ గనరాదు. నూఱుపాముల నది చంపుటయు మంచిది కాదు.

దుర్యో : సువదన యన్నది నిజమే. ముంగి నూఱుపాములఁ జంపుట, దేవిపైఁటఁ దొలఁగించుట, యివి యమంగళములే యగును.

క. ఒకపరి శుభసూచకములు
నొకపరి నశుభంబు లగుచు నొప్పను గలలున్;
వికలత కలిగెను శతనా
మకసంఖ్యను దమ్ముగమిని మాకది తగులన్. ౧౧

(ఎడమకన్నదురుటఁ గని) దుర్యోధనుఁడ నగు నాకుసైత మనిమిత్తములు మనస్సును గలఁచుచున్నవి. (గర్వముతో) కాదు. కాదు. పిఱికివారిని మాత్రమే కలఁచు ననిమిత్తములవలన దుర్యోధనుని కేమిభయము ? అంగిరసుఁ డను ముని చెప్పిన యీమాట లెంతయు సత్యములు;

క. కల, శకునము, గ్రహమును, భూ
తలమున ఫల మిచ్చుఁ గాకతాళీయముగాఁ
జలియింపఁడు ప్రాజ్ఞుఁడు త
త్ఫలమున కిసుమంతయైన ధైర్యముపేర్మిన్. ౧౧

కావున, స్త్రీస్వభావసిద్ధ మగుభానుమతిభయమును నేను బోఁగొట్టుదును.

భాను : చెలీ ! సువదనా ! తనకాంతిపుంజము విరజిమ్మటచే సంధ్యారుణిమ పోఁగాఁ జూచినవారికన్నులఁ బొడుచుచు సూర్యభగవానుఁ డిదే యుదయించుచున్నాఁడు.

తర : భట్టినీ ! పుటముపెట్టినబంగారముతో సమానమైనకాంతిపుంజమును దట్టముగా నల్లుకొన్నతీఁగలనడుమనుండి ప్రసరింపఁజేసి మనయుద్యానవనమునకు బంగారునీరు పోయుచుఁ జూడ నలవికానిరీతిని సహస్రకరభగవానుఁ డాకాశ మలంకరించినాఁడు. అతనికిఁ బుష్పాంజలులతో నర్ఘ్య మొసఁగుట కిదే యదను.

భాను : చెలీ ! తరళికా ! అర్ఘ్యపాత్ర మిటు తే. వేయివెలుఁగుల తండ్రి నుపాసించెదను.

తర : అట్లే. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) ఇదిగో.

దుర్యో : దేవికడ కేఁగుట కిదే యదను. (సమీపించును)

సువ : (చూచి తనలో) మహారాజేలొకో కాని యిటు వచ్చుచున్నాఁడు. ఈమెకు నియమభంగ మగునుగదా !

భాను : (సూర్యునివైపు తిరిగి) భగవానుఁడా ! ఆకాశసరోవరమున కేకైక సహస్రపత్త్ర మైనయోదేవా! పూర్వదిగ్వధూముఖమండల కుంకుమవిశేషా ! సకలభువనమునకు నేకైకరత్నదీపమా ! నాయీవందనములఁ గైకొని నేఁటినాస్వప్నదుర్నిమిత్తములు సానుజుఁ డగునాపతికి శుభప్రదములుగా మార్చివైతువుగాక ! (అర్ఘ్య మిచ్చి) తరళికా ! పూలు తెమ్ము. ఇతరదేవతలను సేవించెద (చేతులు చాఁచును)

దుర్యో : (సంజ్ఞచేఁ బరిజనులఁ బొండని పూలు స్వయముగా భానుమతిచేతులలో వేయఁబోయి స్పర్శసుఖపరవశతను బువ్వులు నేలపై విడుచును.)

భాను : (కోపముతో) ఏమి ! దాసిజనమున కింతయేమఱిపాటా ?

(మరలి రాజును జూచి సిగ్గుపడును)

దుర్యో : దేవీ! ఇట్టిసేవావసరమున నీసేవకుఁ డంతనిపుణుఁడు కాఁడు. శిక్షణ మిచ్చి యేలుకొనుము. ఓప్రియా !

శా. వాలుంగంటి ! భవత్కటాక్షవిలస
ద్భాగ్యంబు నర్థించి నీ
పాలం జేరినదాసునిం గని భయ
భ్రాంతాత్మ వౌ దేటికే ?
ఆలాపింపు ముఖాంబుజంబు స్మితసా
హాయ్యంబునన్ ఫుల్లమై
క్రాలన్. మోడ్చెదఁ గేలుదోయిని, సప
ర్యల్ చేయ సంసిద్ధుఁడన్, ౧౩

భాను : మహారాజా ! అనుమతింపుఁడు. నా కింకొక నియమము పైఁ గోరిక కలదు.

దుర్యో : నీకలగన్న సంగతి యంతయు వింటిని. సహజముగా నతిసుకుమార మైన నీశరీరము నింత క్లేశపెట్టకుము.

భాను : ఆర్యపుత్త్రా! న న్నొకశంక మిక్కిలి బాధించు చున్నది. అనుమతింపుఁడు.

దుర్యో : (గర్వముతో) నీ కేశంకయుఁ గూడదు. ఏలన :

మ. ఇల కంపింప దిశాళి నిండినఫలం
బేదీ మదక్షౌహిణీ
బలముల్ ? ద్రోణుఁడు కర్ణుఁడున్ గలుగు లా
భం బేమి ? పొందంగఁ గొం
దలమున్ ! భ్రాతృశతాస్మదీయబలకాం
తారాంతరచ్ఛాయలన్
గలదుర్యోధనకేసరీంద్రసతి ! యె
న్నంబోకు దుశ్శంకలన్ ! ౧౪

భాను : ఆర్యపుత్త్రా ! నీదగ్గఱ నాకు శంకకుఁ గారణ మేమియును లేదు. ఆర్యపుత్త్రునికోరిక సిద్ధింపవలయు ననియే నేఁ గోరుచున్నాను.

దుర్యో : ఓసుందరీ ! ఐన, నీతో విహరించుటే నాకోరిక. చూడు.

మ. అనురాగస్తిమితాక్షియుగ్మ మది ప
ద్మానంతశోభన్ నగన్;
ఘనలజ్జన్ బలుకుల్ తడంబడఁగ!; జి
ర్నవ్వొప్ప లోలోనఁ, బెం

పును గన్ లత్తుకతోడికెంబెదవి చె
ల్వున్ సుందరీ ! పూర్ణచం
ద్రునికాంతిన్ బురుడించునీముఖము ము
ద్దుల్ నాకు సర్వంబగున్. ౧౫

(తెరలో మహాకలకలము. అందఱు సంభ్రమముతో విందురు)

భాను : (దుర్యోధనుని గౌఁగిలించుకొని) ఆర్యపుత్రా ! రక్షింపుము. రక్షింపుము.

దుర్యో : (అంతయును గలయఁ జూచి) భయపడకు. సఖీ ! భయపడకు. ఇదిగో:

ఉ. పాదపపంక్తి పెల్లగిల
బంధురకాండకషంబునన్ బొగల్
మేదిని గ్రమ్మఁగాఁ దృణస
మీడితమై దివి ధూళి రేఁగఁగా
నాదము లుప్పతిల్లి భవ
నంబుల మేడలఁ జేర శర్కరా
పాదితమై జగం బులియ
వాయువు వీచెడు భీతి యేటికిన్ ? ౧౬

సువ : మహారాజా ! దారుపర్వతప్రాసాదమును బ్రవేశింపుఁడు. ఈపెనుదుమారము కన్నులఁ గప్పివేయుచున్నది. పెళపెళమని పడుచెట్లధ్వనివలన నశ్వశాలలోనిగుఱ్ఱములు బెదరి కట్లు ద్రెంచుకొని పరుగులెత్తుచున్నవి. పరిజను లెల్లరును మూలల దూఁగిరి. ఈగాలిబాధ చాల భీకరముగ నున్నది.

దుర్యో : ఈసుడిగాలి నిజముగా నాకు మహోపకారి. ఏలన, దీని

దయవలననే యప్రయత్నముగ నియమము విడిచి దేవి నామనో
రథ మీడేర్చినది. ఎట్లన దేవికి :

మ. కనుబొమ్మల్ ముడి గాంచ లేదు: మఱి పొం
గన్ లేదు కన్నీరు, మో
మును గోపంబును గాంచ లేదు, శపథం
బుల్ పల్కకే వర్తుల
స్తనముల్ హత్తి యొసంగె నా కిటు ప్రసి
ద్ధం బైనయాలింగనం
బును భీతాత్మత దేవి, యీపవన మౌ
ముఖ్యాత్మమిత్రం బహో ! ౧౭

నాకోరిక సిద్ధించినది. ఇఁకఁ గామాచారమునకు దారుపర్వత
ప్రాసాదమునకే పోవుదు. (అందఱు వాయుబాధచేఁ గష్టమున
నడతురు.)

దుర్యో : దేవీ !

గీ. మెల్లమెల్లన నడుగుల నుల్లసిల్లఁ
జేసి నడువుము వణఁకకు స్నిగ్ధబాహు
లతికఁ బెనవేయుమీ నన్ను సతి ! యురంబు
గాఢకుచఘర్షణంబున గాయపఱుప. ౧౮

(ప్రవేశించి) ప్రియా ! ఈలోపలియింటిలోనికి గాలి చొరఁ
జాలదు. కనులలోఁ బడిననలకలు తుడుచుకొని కన్నులు
తెఱువుము.

భాను : (ఆనందముతో) అబ్బ ! గాలిబాధ తగ్గినది.

సువ : మహారాజా! దేవితొడలు పర్వతారోహణమున నలసినవి.
ఆసనము లలంకరింపుఁడు.

దుర్యో : (భానుమతిని జూచి) ఈసుడిగాలి నీకుఁ జేసినకీడు స్వల్పమే. ఐనను :

చ. నలుసులు చిన్నవైన నయ
నంబులు పెద్దవి కాన బాధ యౌ,
నలఁతియె కంప మైనను గు
చాత్మకవక్షము ధూతహార మౌ
విలసిలుఁ గంపమున్ జఘన
వి స్తృతి యూరులఁ జేరినంతనే,
చెలియ ! త్వదంగముల్ పవను
చెల్మిని ని న్నిటు బాధపెట్టెడున్. ౧౯

(అందఱును గూర్చుందురు)

దుర్యో : ఏమి? దేవి కఠిన మైనశిలాతలమునఁ గూర్చున్నది! దేవీ!

గీ. గాలిచేతను నీయంశుకంబు తొలఁగఁ
గనులపండువు గొల్పునీఘనజఘనము
గౌరవించును నాయంశుకంబు తొలఁగ
నువిద! నీచూపుఁ దన్పు నాయూరుయుగము. ౨౦

(కంచుకి తెరఁ జించుకొని తత్తఱమునఁ బ్రవేశించును.)

కంచు : దేవా ! భగ్నము. భగ్నము.

దుర్యో : ఎవనిచే.

కంచు : భీమప్రభంజనముచే.

దుర్యో : ఏమి యీ [యనర్థక] ప్రలాపము ?

భాను : ఆర్యకంచుకీ ! నీవు చెప్పఁదలఁచినది స్పష్టముగఁ జెప్పుము.

దుర్యో : చీ ! ప్రేలరీ ! ముదివగ్గా! నీ కీపిచ్చి యెట్లు కలిగినది?

కంచు : దేవా ! భ్రాంతి లేదు. నిజమే చెప్పుదును :

గీ. భగ్నమయ్యెను భీమప్రభంజనమునఁ
బ్రీతిఁ గూర్చెడినీరథకేతనంబు
కింకిణీక్వాణబద్ధయై క్రిందఁబడియె
బిగ్గరగ నేడ్చునట్టు లప్రియకరముగ.

దుర్యో : ఈపెనుగాలిచే భూమియే కంపించినది. రథకేతనము పడుటలో వింతయేమి ? ఇంతమాత్రమున కంతగా భగ్నమైన దని ప్రేలెదవేల ?

కంచు : దేవా ! ఏమియును లేదు. ఈయనిమిత్తమునకు శాంతి చేయుఁ డని తమతోఁ జెప్ప నాస్వామిభక్తి న న్నట్లు పలుకఁ జేసినది.

భాను : ఆర్యపుత్త్రా ! ఈయనిమిత్తములను విప్రమండలాశీర్వచనఘోషమునఁ బోఁగొట్టుకొందము.

దుర్యో : సూతుఁడా ! నీవు పోయి సుమిత్రుఁ డను పురోహితునితోఁ జెప్పుము.

కంచు : చిత్తము. (నిష్క్రమించును)

(ప్రవేశము : ప్రతీహారి)

ప్రతీ : (ఉద్వేగముతో) జయము ! జయము ! మహారాజా! అల్లురగు జయద్రథులవారితల్లియు దుస్సలకుమారియు వచ్చి ద్వారముకడ నున్నారు.

దుర్యో : (తనలో) ఏమి ! జయద్రథమాతయు దుస్సలయునా ! అభిమన్యుని మరణమునఁ గలిగినకోపమునఁ బాండవు లేమైన నుపద్రవముఁ గలిగించిరేమో ? (ప్రకాశముగా) త్వరగాఁ బ్రవేశపెట్టుము.

ప్రతీ : చిత్తము. (నిష్క్రమించును)

(అంత సంభ్రాంతలై జయద్రథమాతయు దుస్సలయుఁ బ్రవేశింతురు.)

ఉభ : (కన్నీటితో దుర్యోధనునిపాదములపైఁ బడుదురు)

జయ : కురునాథా ! రక్షింపుము. రక్షింపుము,

దుస్స : (ఏడ్చును)

దుర్యో : (తొందరగా లేచి) అంబా! ఊఁఅడిల్లుము. ఏమి సంగతి? సంగ్రామమున నప్రతిరథుఁ డగుజయద్రథునకుఁ గుశలమేకదా!

జయ : నాయనా ! ఏమికుశలము ?

దుర్యో : ఏమి ?

జయ : (దుఃఖముతో) నిజపుత్త్రవధచేఁ గోపియై యర్జునుఁడు సూర్యుఁ డస్తమించులోపుననే జయద్రథుని వధింప శపథము పట్టినాఁడు.

దుర్యో : (నవ్వుచు) ఇదియా ! మీదుఃఖకారణము ! పుత్త్రశోకమునఁ బిచ్చియెత్తి యర్జునుఁడు ప్రేలినమాటల కిట్లు సంతాపింతురా ? ఆహా ! ఏమి ! అబలలముగ్ధత్వము, అంబా ! విషాద మందకుము. వత్సా ! దుస్సలా ! ఏడువకు. ఇట్టి దుర్యోధనరక్షితుఁ డగు జయద్రథమహారాజున కెట్లు విపత్తు కలుగును ?

జయ : వత్సా ! పుత్త్రబంధువధవలనఁ గలిగిన కోపాగ్నిచేఁ బాండవులు శరీరములను సరకుగొనక వీరవిహారము చేయుచున్నారు.

దుర్యో : (నవ్వి) ఔను ! పాండవులకోపము సర్వజనప్రసిద్ధమే. చూడు :

చ. కరమునఁ గొప్పువట్టి పయి
గా నటు లీడిచి కట్టుఁబుట్టముల్
తొరఁగఁగ విప్పి యాసభను
ద్రోవది "నోపశువా!" యటంచు బ
ల్మరు లటు పిల్వఁగా నచట
మ్రాన్పడి యుండఁడె యర్జునుండు; నిం
కరయఁగ రాచపుట్టువున
కన్యము గల్గునె క్రోధహేతువుల్? ౨౨

నాటకభాష్య, కుమారక.
జయ: కుమారా? తనప్రతిజ్ఞ నెఱవేఱనిచో నాత్మహత్య చేసి కొందునని యాతని శపథము.

దుర్యో: ఐన, మఱియు మంచిది, ఈ యానందవిషయమున కిటు విషాద మందుదురేల? యుధిష్ఠిరుఁడు తమ్ములతో నశించె ననియే యానందింపుఁడు. ధనంజయునకుఁ గాని మఱి యన్యునకుఁ గాని కురుశతపరివారవర్ధితమహిముఁడు, కృతవర్మ కర్ణ ద్రోణాశ్వత్థామాది మహారథ ద్విగుణీకృత నిరావరణవిక్రముఁడు నగుజయద్రథునిపేరైనఁ దలఁప వశమా? నీవు నీపుత్త్రునిపేరిమి నెఱుఁగనిదానవు!

గీ. భీముశౌర్యము నర్జునువిక్రమంబుఁ
దలఁచి ధర్మజుఁ గవలను దలఁపరాదు.
వీరిలోనైన నెదిరించి పోర నెవఁడుఁ
జాలఁడు జయద్రథుఁడు విల్లు కేలఁ గొనిన. ౨౩

భాను: ఆర్యపుత్త్రా! ఏమైన నట్టిఘోరప్రతిజ్ఞ చేసినయర్జునుఁడు భీతావహుఁడుగదా!

జయ: వత్సా! కాలోచితముగాఁ బలికితివి.

దుర్యో : ఏమి ! నాకును బాండవులు భీతావహులా ? వినుము :

సీ. కోదండశింజినీఘోరకిణాంకులు
నగణితరిపువీరహరులు తమ్ము
లాముక్తవర్మలు నన్యోన్యమిత్త్రులు
నూర్వురు సితపద్మినులను బోలు
నాతపత్రంబుల నరుదేరఁ బెనురజ
మ్మాదిత్యతేజమ్ము నడఁపఁజాల
విచ్చుకత్తులు పూని విచలదసిలతాప్ర
బంధురంబుగ దెసల్ పర్వి నడవ

గీ. సకలసైన్యసుయోధులు సర్వభూమి
యానినటు లుండి మాత్సర్య మూని శత్రు
వితతిఁ జెండాడ నెత్తి జృంభింపఁగలరు
భయ మదేటికి నీకింకఁ బాండవు లన ? ౨౪

భానుమతీ! పాండవప్రభావ మెఱిఁగినదాన వయ్యు నీవును భీతి లెదవేల ? చూడుము :

గీ. దుస్ససేనునెడందనెత్తురులు ద్రావ
గదను దుర్యోధనునితొడల్ ప్రిదులఁగొట్టఁ
బాండవులు చేసియున్నట్టిప్రతిన లటులె
సైంధవునిఁ జంపుశపథము జడియ నేల ? ౨౫

ఎవ రక్కడ ? జైత్రరథమును రప్పింపుము. వెంటనే నేను పాండవమధ్యముని వ్యర్థప్రతిజ్ఞునిఁ గావించి యాతని కశస్త్ర పూత మగు మరణము నాపాదించెదను.

కంచుకి : (ప్రవేశించి) దేవా !

క. బంగరుచిఱుగంటలు మ్రోఁ
గంగను బ్రాలంబవీచికాహాసము వె
ల్గంగను వల్గితహయరథ
ముం గొని వచ్చితి క్షపితరిపుమనోరథమున్. ౨౬

దుర్యో : దేవీ ! నీవు లోని కేఁగుము.

(వెంటనే నేను....ఇత్యాదిని మరలఁ జదువుచుఁ బరిక్రమించును.)

(అందఱు నిష్క్రమింతురు) Partition

ఇది ద్వితీయాంకము.

---

(వికృతవేష యగురాక్షసి ప్రవేశించును.)

రాక్ష : (వికటముగా నవ్వి యానందముతో)

క. చచ్చినమనుజులమాంసము
మెచ్చగువస నెత్రు వేయి మేల్కడవలలో
నచ్చుగ దాఁచితిఁ; ద్రావెద
నిచ్చటఁ. బో రుండుఁగాక ! యిల నూఁటేఁడుల్. ౧

(సంతోషమున నెగిరి గంతులు వేయును) సైంధవునిఁ జంపిననాఁటి వలె నిత్యము నర్జునుఁడు యుద్ధము చేయుచున్న నాయిల్లంతయు రక్తమాంసములతోడనే నిండియుండును. (ముందు కేఁగి దెసలు చూచి) ఆహా ! రుధిరప్రియుఁ డెక్కడ నున్నాఁడో ? (నడచి) వానిని బిలిచెదను. రుధిరప్రియా ! రుధిరప్రియా !

రుధిరప్రియుఁడు ! (ప్రవేశించి, ఆయాసపడుచు)

క. మనుజులక్రొన్నెత్తురు వె
చ్చనిమాంసము దొరకెనేని సత్వరమునఁ బో
వునుగద ! నాశ్రమ మంతయు
క్షణమాత్రములోనఁ బరమసంతోషముగన్. ౨

రాక్ష : (మరలఁ బిలుచును)

రుధి : (విని) ఎవరి దీపిలుపు ! (చూచి) ఓహో ! వసాంగధ. (దగ్గఱకుఁ జేరి) వసాంగధా ! నన్నేల పిలిచితివి ?

రాక్ష ! ఓరుధిరప్రియా ! నీకోస మిపుడే చచ్చినయొకరాజర్షి శరీరావయములనుండి దొరకి వసాస్నేహమునఁ జిక్కనైనగోరువెచ్చని క్రొన్నెత్తురు హృదయమాంసము తెచ్చితిని. ఇవిగో.

రుధి ! (సంతోషముతో) సెబాస్: వసాంగధా! సెబాస్. గృహిణీ! నాకు శోభనము చేసితివి. నే నీతిండి కెదురెదురు చూచు

చుంటిని. నా కెంతో దాహ మగుచున్నది.

రాక్ష : ఓరుధిరప్రియా ! ఈరీతి హతనరగజతురగశోణితవసా సమ్మర్ద మైనయుద్ధరంగమున నుండియు నీవు దప్పిగొనుట నా కాశ్చర్యముగ నున్నది.

రుధి : ఓసీ ! ఘటోత్కచుఁడు చనిపోవుటవలనఁ బుత్త్రశోకమున నున్నహిడింబాదేవిని జూచి రా నేఁగితినే.

రాక్ష : ఇంకను హిడింబాదేవి ఘటోత్కచునికొఱ కేడ్చుచునే యున్నదా ?

రుధి : ఆమె యెట్లూరకుండును ! అభిమన్యునిచావున నట్టి దుఃఖములోనే యున్నసుభద్రాద్రౌపదు లామె నోదార్చుచున్నారు.

రాక్ష : రుధిరప్రియా ! పెద్దయేనుఁగుపుఱ్ఱెలో నుండి తీసి దాఁచిన రక్తమాంసము లివిగో. పుచ్చుకో.

రుధి : (పుచ్చుకొని త్రాగి) వసాంగధా ! నీ వేమాత్రము రక్తమాంసముల దాఁచియుంచితివి ?

రాక్ష : వెనుక దాఁచియుంచినవి నీవే యెఱుఁగుదువు. ఇపుడు దాఁచినవి వినుము. భగదత్తునిశోణిత మొకకడవ. సైంధవుని వస కుంచెఁడు. ద్రుపదమత్స్యరాజభూరిశ్రవస్సోమదత్తబాహ్లికప్రముఖులయు, రాజులయుఁ దక్కినసామాన్యులయు మాంసము, వస, నెత్తురు వేలకొలఁదికడవలు.

రుధి : (సంతోషముతోఁ గౌఁగిలించుకొని) సెబాస్ : నీ వెంత మంచి భార్యవే. నీవంటి బంగరుభార్యవలన, హిడింబకృపవలన, నాదారిద్ర్యము తొలఁగినది.

రాక్ష : హిడింబకృప యెట్టిది ?

రుధి : ఇపుడే హిడింబాదేవి నన్ను సబహుమానముగాఁ బిలిచి "రుధిరప్రియా ! నీవు నేఁడు మొదలు సమరమున నార్యపుత్త్రుని వెనువెంటఁ దిరుగుచుండు" మని యాజ్ఞాపించినది. ఇఁక నా కేమికొఱఁత ? ఆఁకలిదప్పు లెఱుఁగక స్వర్గసుఖ మనుభవించెదను. నీవును రక్తమాంసములను శ్రద్ధగా వేయికడవలు దాఁచి యుంచుము.

రాక్ష : నిన్ను దేవియార్యపుత్రునితో నుండుమన్న దేల?

రుధి : భీమసేనుఁడే దుశ్శాసనునిరక్తముఁ ద్రావఁ బ్రతినపట్టి నాఁడు. కాన, నీ వాతనిలో నుండి రక్తపానము చేయు మని నన్నంపినది.

రాక్ష : దేవీ ! మంచిది. నీదయవలన నాభర్తపుణ్యము పండినది.

(తెరలో మహాకలకలము)

ఉభ : (విందురు)

రాక్ష : (విని) ఏమి యీకోలాహలము ?

రుధి : ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని సిగఁ బట్టి కత్తితోఁ గుత్తుక నఱకుచున్నాఁడు.

రాక్ష : మనముకూడ నేఁగి ద్రోణుని రక్తము త్రాగుదమా ?

రుది : ఓసి ! నీయిల్లు కాల ! అది విప్రరక్తమే ! అది త్రాగినఁ గంఠము మండి చచ్చిపోవుదుము.

(తెరలో మరలఁ గలకలము)

రాక్ష : మరల నీకలకల మేమి ?

రుధి : అశ్వత్థామ కత్తి చేతఁ బట్టుకొని యిటే వచ్చుచున్నాఁడు ! ధృష్టద్యుమ్నునిమీఁది కోపమున నాతఁ డేమి చేయునో ? నేను బోయి హిడింబాదేవి చెప్పినట్లు చేయుదును. రమ్ము. పోదము.

(నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

---

# తృతీయాంకము

[ఒరనుండి తీసి పై కెత్తిపట్టిన కత్తితో నశ్వత్థామ కలకల మాలించుచుఁ ప్రవేశించును.]

అశ్వ : ఈరణభూమిని :

గీ. ప్రళయమారుతక్షుభితసంవర్తమేఘ
ఘోరగర్జితప్రతిరవకారి యగుచుఁ
జెవు లవియ రోదసియు నిండ మివులఁ బుట్టె
నెన్నఁ డెఱుఁగనియీధ్వని యేమి చెపుమ ? ౧

(ఆలోచించి) నిజము. గాండీవి కాని సాత్యకి కాని భీమసేనుఁడు కాని యౌవనదర్పమున మర్యాద మీఱి వర్తించినఁ గోపించి తండ్రి విజృంభించి పాండవులమీఁది శిష్యప్రేమ విడిచి నిజ శక్తిఁ జూపియుండును. ఏలన :

మ. అల దుర్యోధనపక్షపాతసదృశం
బస్త్రగ్రహోత్కోచితం
బలఘుశ్రీభృగురామలబ్ధఘనశ
స్త్రాస్త్రానురూపంబు ని
శ్చలధానుష్కగురూత్తమోత్తమరుషా
సాధ్యంబు నౌతాతపా
దులకృత్యం బిది ; యేఁడు మార్కొను ననిన్
ద్రోణున్ మహావీరునిన్ ! ౨

(వెనుకఁ జూచి) ఈరథముకొఱ కెదురుచూచుట చాలును. సజల జలధరప్రభాభాసురమై స్వర్ణమయముష్టిఁ గలిగినయీ కత్తియే

నాకు సమస్తమును. వెంటనే రణరంగమున నుఱికెదను. (నడచి, ఎడమక న్నదరుటఁ గని) ఏమి ! సమరమహోత్సవ ప్రమోదనిర్భరతాతవిక్రమదర్శనలాలసుఁడను, అశ్వత్థామ నైన నాకును నీదుశ్శకునములు సమరగమన విఘ్నము లగుచున్నవే! కానిమ్ము. (గర్వముతో నడచి ముందు చూచి) ఏమి ! సర్వక్షత్త్రి ధర్మములు విడిచి, సత్పురుషోచితలజ్జావగుంఠనముల వీడి, విస్మృత స్వామి భక్తిలఘుచేతసులై యగణిత కులబలసదృశ ప్రతాపములను గలిగియు నీరథద్విరదతురగ పాదచారులు రణ భూమికిఁ దొలఁగి పాఱిపోవుచున్నారే ! (నిరూపించి) అయ్యో ! కష్టము. కష్టము. కర్ణాదిమహారథులును యుద్ధపరాఙ్ముఖు లగుచున్నారే ! పిత్రాధిష్ఠిత మగు కౌరవబలమున కీయవస్థ రాఁ గారణ మేమి చెపుమా ! ఏమైనఁ గానిమ్ము. ఓ కౌరవ సేనాసముద్ర వేలాపరిపాలనమహా మహీధరు లగు నరపతు లారా ! ఈసమరపరిత్యాగసాహసమేల ?

గీ. రణముఁ దొరఁగిన మృత్యువు రాకయున్నఁ
బోవవచ్చును వేఱొకభూమి కకట !
చావు తప్పదు జనులకుఁ జేవ దక్కి
దుర్యశంబును గొననేల ! దుర్మతు లయి ? 3

మఱియు :

చ. ప్రతిబలవార్ధిహేతియుత
బాడబుఁడున్ మహి సర్వధన్విసం
తతికిని సద్గురుండు నగు
తండ్రి చమూపతి యై చెలంగ నీ

గతిని భయం బదేల ? నిలు
కర్ణ ! కృపా ! కృతవర్మ ! నిల్వుఁడీ
ధృతిమెయిఁ బాఱిపోకుఁ డిటు
దీనత నుక్కఱి మానహీనులై. ౪
(తెరలో : "ఇంకను నీతండ్రి యెక్కడ")

అశ్వ : (విని) ఏమంటిరి? "ఇంకను నీతండ్రి యెక్కడ" ననియా? ఓరీ! క్షుద్రులారా! ఇట్లు ప్రేలుచున్న మీనాలికలు వేయి చీలికలు కావేమి ?

మ. భువనం బేర్పఁగ ద్వాదశార్కు లుదయం
బుం బొంద లే దింక; స
ప్తవిధం బై లయకాలవాయువులు వీ
వన్ లేదు, సంవర్తమే
ఘవితానం బది యాక్రమింపదు వియ
ద్గర్భంబు, నస్మత్పితన్
జవజీవంబులశౌర్యరాశిఁ బలుకన్
భావ్యంబె పాపాత్మకుల్ ! ౫

(సంభ్రాంతుఁడై దెబ్బలుతిన్న సూతుఁడు ప్రవేశించును)

సూతు : కుమారా! రక్షింపుము. రక్షింపుము. (పాదములపైఁబడును)

అశ్వ : (చూచి) ఏమి ! తండ్రిసారథి ? అశ్వసేనుఁడే ! ఔరా ! మూఁడు లోకములు రక్షింపఁజాలిన తండ్రి సారథివై యుండి నాశరణముఁ గోరనేల ?

సూతు : (లేచి దుఃఖముతో) ఇంకను నీతండ్రి యెక్కడ ?

అశ్వ : (ఆవేగమున) ఏమి ! నాతండ్రి యెక్కడ ?

సూతు : ఉన్న నిఁక నేమి ?

అశ్వ : అయ్యో ! (మూర్ఛిల్లును)

సూతు : కుమారా ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

అశ్వ : (తెలివంది) అయ్యో ! తండ్రీ! సుతవత్సలా ! హా! త్రిలో కైకధనుర్ధారీ ! హా! పరశురామసర్వాస్త్రప్రతిగ్రహనిపుణా !

సూతు : ఆయుష్మంతుఁడా ! ఇంక దుఃఖమును దిగమ్రింగు కొనుము. నీతండ్రి వీరపురుషోచిత మగుమరణము నందినాఁడు. నీవును దాని కనురూప మగుశౌర్యమున శోకసముద్రమును దాఁటి సుఖింపుము.

అశ్వ : ఆర్యా ! చెప్పుము. చెప్పుము. అట్టిభుజవీర్యాస్త్రప్రభావ సాగరు లగుపితృదేవు లెట్లు మరణించిరి ?

మ. గదచేతన్ గురుదక్షిణన్ బ్రియమునన్
గైసేసెనే భీముఁడు ?

సూతు : కాదు. కాదు.

అశ్వ : ఉ, న్మదగాండీవియె శిష్యవత్సలుని స
మ్మానించెనే యమ్మలన్ ?

సూతు : అదియును గాదు.

అశ్వ : మది గోవిందుఁడె కోరి చక్రమునఁ జం
పన్ లేదుగా సద్గురున్ ?

సూతు : కాదు. కాదు.

అశ్వ : మదిలో నాల్గవవాఁడు తోఁపఁడు పితన్
బ్రమందించుశక్తుం డిఁకన్.

సూతు : కుమారా ! నీతండ్రి :

మ. రణరంగంబునఁ గ్రోధమూర్తి యయి శ
ర్వప్రక్రియన్ జేత మా

ర్గణముల్ తాల్చిన భీమకృష్ణయుతుఁడౌ
గాండీవి యేలెక్క ? యా
తనికిన్! దారుణశోకభారమున శ
స్త్రం బుజ్జగింపన్ దనం
తను దాఁ, గ్రూరరింపుడు చంపె నతనిన్
వత్సా! కడుం గ్రూరతన్. ౩

అశ్వ : అతనిశోకావేగమునకుఁ గాని యస్త్రత్యాగమునకుఁ గాని కారణ మెవరు ?

సూతు : నీవే.

అశ్వ : నే నెట్లు ?

సూతు : (కన్నీరు విడిచి) వినుము :

మ. పలికెన్ బిగ్గరగా యుధిష్ఠిరుఁడె "య
శ్వత్థామ చచ్చెంగటా !"
యట మెల్మెల్లన "నేనుఁ" గంచుఁ దనలో
నాపిమ్మటం బల్కె నా
తొలిమాటన్ విని పుత్త్రశోకహతుఁడై
ద్రోణుండు బాష్పాంబుధా
రలతోఁ దుల్యముగా నొనర్చె సకలా
స్త్రత్యాగమున్ నాఁ డనిన్. ౪

అశ్వ : అయ్యో ! తండ్రీ ! హా ! సుతవత్సలా ! వ్యర్థముగా నాకొఱకై మరణించితివా ? తండ్రీ ! అయ్యో ! శౌర్యరాశీ ! హా ! శిష్యప్రియా ! హా ! యుధిష్ఠిరపక్షపాతీ ! (దుఃఖించును)

సూతు : కుమారా ! ఇటు లింత పరితపించుట తగదు.

అశ్వ :

చ. మృష యగునామృతిన్ విని సు
మీ ! సుతవత్సల ! వీడినావు నా
విషయమునన్ శరంబులును
వెంటనె ప్రాణము లైదు నక్కటా !
మృష యనరానినీమృతిని
మేదిని గాంచియుఁ జావనైతి: నా
విషయము క్రూర మిట్టియెడఁ
బ్రేమముఁ జూపితి వెట్లు నాపయిన్ ?

(మూర్ఛిల్లును)

సూతు : కుమారా ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

(అపు డుద్వేగముతోఁ గృపుఁడు ప్రవేశించును.)

కృపు : అయ్యో !

చ. కురుపతి యేల ! యింకతని
కూరిమితమ్ములు నేల ? యాయుధి
ష్ఠిరుఁడును శస్త్రధారినృప
సింహులు నిందఱుఁ గాల్వనా ? కటా !
కురుసభఁ బాండుపత్ని నటు
క్రూరరణంబున ద్రోణు నిట్టు ల
చ్చెరువుగఁ గేశసంగ్రహణ
శీర్షులఁ గంటిమి సిగ్గుచేటుగన్. ౧౦

ఇటులైనపిమ్మట వత్స యగునశ్వత్థామముఖ మెట్లు చూడఁ గలను ? ఐన, నాతఁడు ధైర్యహేమాచలుఁడు, విజ్ఞాతలోక స్థితుఁడు. కాన, నంతగా దుఃఖింపఁడు. ఏమైనను, అసదృశ

మగు నిట్టి పితృపరాభవమును విని యాతఁ డెంత ఘోరకృత్య మొనరింపఁ గడంగునో యెఱుఁగఁ జాల కున్నాఁడను. ఇదికాక:

క. తొలిద్రౌపది కేశగ్రహ
ఫల మనుభూతం బగుచునుండె బంధురముగ నిం
కిల రెండవ కేశగ్రహ
ఫల మనుభూతంబు నగును బ్రవినాశమునన్. ౧౧

(చూచి) వత్స యిట నున్నాఁడు. సమీపింతును. (సమీపించి సంభ్రమముతో) వత్సా! ఊఱకుండు మూఱకుండుము.

అశ్వ: (తెలివంది దుఃఖముతో) అయ్యో! తండ్రీ! సకలభువనైకగురూ! (ఆకసము చూచి) ఓ యుధిష్ఠిరా!

ఉ. పుట్టిననాఁటినుండియును
బొంకి యెఱుంగ వజాతశత్రుఁడా!
మెట్టితి కీర్తి యన్యులకు
మేలె యొనర్చియు నా యభాగ్యముం
బట్టియె మట్టిఁ బెట్టితివి
మాటనె బొంకి యనంతకీర్తి, నో
కట్టిఁడి! నీ వెఱుంగవె జ
గద్గురుఁ దండ్రిని బ్రాహ్మణోత్తమున్? ౧౨

సూత: వత్సా! ఇదిగో! నీమామ శారద్వతుఁ డరుదెంచి నీప్రక్కఁ గూర్చుండి యున్నాఁడు.

అశ్వ: (ప్రక్కకుఁ జూచి కన్నీటితో) అయ్యో! మామా! నీవు

మ. ఎవనిం గూడి రణాంగణంబునకు నో
యీ! పోయి యున్నాఁడవో

యెవఁడౌ వీరులచేతితీఁటకును నెం
తే నాశకుం డెప్పు, డీ
వెవనిం జేరుదు నవ్వులాటలకునై
యింపౌ క్రియన్, శౌర్యవి
ప్రవరుం డాతఁడు నీమఱంది యెటు పో
వం గాంచెనో చెప్పవే? ౧౩

కృపు: వత్సా! అంతయు నీకే తెలియును. మఱి యిఁక విచారింపకుము.

అశ్వ: మామా! నా దుఃఖమును విడిచి సుతవత్సలుఁ డైన తండ్రికడ కిదే పోవుచున్నాను.

కృపు: వత్సా! ఇది నీకుఁ దగినది కాదు.

సూతు: కుమారా! సాహసము వలదు.

అశ్వ: ఆర్యా! ఏమంటివి?

గీ. మద్వియోగభయంబున మహితుఁడైన
జనకుఁ డరిగెను బరలోకమునకుఁ గాన
నెటులు విరహంబుఁ గలిగింతు నిపు డతనికి
నతని వాత్సల్యమున కిది ప్రతిఫలంబె? ౧౪

కృపు: వత్సా! ఈప్రపంచమున నున్నంతవఱకు లోకయాత్ర తప్పదు. పుత్త్రుఁడు తండ్రి నుభయలోకములందు ననుసరింప వలయును గదా!

గీ. తర్పణంబున మఱియు శ్రాద్ధంపుఁగర్మఁ
దండ్రి కుపకార మొనరింపఁ దగుదు వీవు
బ్రతికి యుండిన; నటుగాక మృతిని గన్న
దేనికిం గొఱగావుచూ దాన వత్స! ౧౫

సూత : ఆయుష్మంతుఁడా! శారద్వతుఁడు చెప్పినట్లు నడచు కొనుము.

అశ్వ : ఆర్యా! నిజమే. భరింప రాని యీ పితృవిరహమున క్షణమైనను బ్రాణములు నిలుపఁజాలకుంటిని. అందుచేఁ దండ్రి పడియున్నకడకైన నేఁగి యాతనిం జూచెదను! (లేచి కత్తిఁ జూచి, ఆలోచించి) ఈశస్త్రమును గైకొనుటవలనఁ గలిగిన ప్రయోజన మిఁకఁ జాలును. ఓ పూజ్యశస్త్రమా!

చ. ఉచితము కాకపోయినను
నోటమిభీతి నెవండు నిన్నుఁ దా
లిచెనొ. తలంప నెవ్వనికి
లీలఁ గ నీకెదు రెండు లేదొ యా
సుచరితుఁ డాత్మపుత్త్రఘన
శోకమునన్ నిను వీడెఁ గాన నే
నిచట నినుం ద్యజింతు నిఁక
నేఁగుము నీకు శుభంబు శస్త్రమా! ౧౬

(విడువఁబోవును.) (తెరలో)

ఓరాజులారా! ఏమేమి! గురువరు నొక ఘాతుకుఁ డిట్లు పరాభవించుచుండఁగా మీ రంద ఱటు లేల యుపేక్షించినారు?

అశ్వ : (మరల శస్త్రమును గ్రహించి) ఏమి! నా తండ్రికే పరాభవమా?

(మరలఁ దెరలో)

శా. కన్నీటం గడు నార్ద్రమైనముఖరే
ఖం బొల్చి పుత్త్రవ్యథా

ఛిన్నత్వంబున నస్త్రముల్ విడిచి దుః
భీభూతుఁ డయ్యెన్ గురుం
డన్నన్ జూచియుఁ దజ్జరాపలితకే
శౌఘంబుఁ జేఁబూని సం
ఛిన్నగ్రీవు నొనర్చి యున్నఖలు చీ!
చీ! మీరు సైరింతురే? ౧౩

అశ్వ : (కోపముతోడను గంపముతోడను గృపసూతులనుజూచి)

ఏమేమి!

మ. పరమం బైనశమంబుఁ బూని ప్రియతన్
ప్రాయోపవేశంబునన్
మరణం బందఁగఁ గోరి వి ల్విడిచి యు
న్నం జూచి నాతండ్రి నొ
క్కరుఁ డేతెంచి తదీయమౌళిపయి న్య
క్కారంబునన్ జేయిపై
చి రయం బొప్పఁగ గోసెనే గళము చీ
చీ రాజు ల ట్లుండఁగన్? ౧౪

కృపు : వత్సా! జను లట్లే చెప్పుచున్నారు.

అశ్వ : నాతండ్రితల నొక దురాత్ముఁడు తాఁకెనా?

సూతు : (భయముతో) కుమారా! తేజోరాశి యగునట్టి మహాను
భావున కిట్టి పరాభవము కలిగినదికదా!

అశ్వ : అయ్యో! తండ్రీ! మందభాగ్యుఁడ నగు నాకై య
ట్లస్త్రసన్న్యాసము చేసి యి ట్లొక క్షుద్రునిచేఁ బరాభవము
నందితివా? కానీ,

చ. అనిమొన శోకసాగరము
నందు మునింగి త్యజించి శస్త్రమున్
జనుపితశీర్షమున్ దగులు
శ్వానమొ కాకమొ ద్రౌపదుండో త
ద్ఘనబహుశస్త్రధారి బల
గర్వ మడంగఁ దదీయమౌళిపై
నునిచితి వామపాద మిదె
యొప్పుగఁ: గాదు కరంబు; చూడుఁడీ! ౧౯

ఓరీ! దురాత్మా! పాంచాలాపశదా!

శా. తాతన్ శస్త్రిసమస్తసన్న్యసను సం
తాపస్థితున్ జేరి ని
ర్భీతిన్ దత్పరమోత్తమాంగమును పా
పీ! ముట్టఁగాఁ జాలినా
వా? తత్పావనుపుత్త్రిరత్నమును న
శ్వత్థామ నూహించితే?
చీ! తుచ్ఛా! యిదె నీఱుచేయుదును నీ
సేనన్ నినున్ సర్వమున్. ౨౦

ఓయీ! యుధిష్ఠిరా! అజాతశత్రూ! సత్యవాదీ! నీకును నీ తమ్ములకును నాతండ్రి యేయపకారము చేసెను? పోనీ. అపకృతిజిహ్మచేతనుఁ డగునతనితో నాకేమి గాని యోయర్జునా! సాత్యకీ! బాహుబలశాలీ! వృకోదరా! గోవిందా! సురాసుర భుజగమనుజలోకైక ధనుర్ధరుఁడు, విప్రశ్రేష్ఠుఁడు, ఆచార్యవరుఁడు, విశేషించి నాతండ్రియునైన ద్రోణునిశిర మొక్క

నికృష్టుఁడు ద్రుపదకులకళంకుఁడు నగు నొకమనుష్యపశువు తాఁకుటఁ జూచి యుపేక్షించుట తగునా ? కాదు. మీ రందఱును బాతకులే. మీతో నాకుఁ బనియేమి ?

చ. కరముల నాయుధంబు లటు
క్రాలఁగ మీరలు సద్గురున్ మహా
చరితుని నట్లు పాతకము
సల్పిన మూర్ఖుని సైఁచినారుగా ?
నరపశువుల్ మిమున్ రిపుగ
ణంబును బార్థమ్మకోదరాచ్యుతాం
కురముగ రక్తమాంసములఁ
గోరికతో బలియిత్తు దిక్కులన్. ౨౧

కృపు : వత్సా ! ద్రోణతుల్యబాహుశాలివి దివ్యాస్త్రగ్రామకోవిదుఁడవు నగునీకు సాధ్యము కాని దేది ?

అశ్వ : ఓ పాండవ సోమక మత్స్య మాగధాదిక్షత్రియాపశదులారా !

చ. గురునిశిరంబు ముట్టుటనె
ఘోరమహానలసన్నిభంబు భీ
కర మగు గండ్రగొడ్డలిని
క్షత్రియసంతతి నేమి చేసెనో
యెఱుఁగరె భార్గవుం ? డటులె
హింస యొనర్చును ద్రోణపుత్త్రుఁ డు
ద్ధురరుష మిమ్ము నందఱను
దోఁగును దద్రుధిరాంబుధిన్ దగన్. ౨౨

సూతా ! సర్వోపకరణములతో సాంగ్రామికకృత్యమునకై మహా రథావలక్షణ మను నా రథమును సర్వాయుధోపేతముగాఁ గొనిరమ్ము.

సూతు : చిత్తము. (నిష్క్రమించును.)

కృపు : వత్సా ! తప్పక ప్రతిక్రియ చేయఁదగిన యీ దారుణ పరాభవాగ్నిని నీవుగాక మే మెట్లు చల్లార్పఁగలము ?

అశ్వ : నా యనంతర కర్తవ్య మేమి ?

కృపు : నీవు సేనాపతివిగా నభిషిక్తుఁడవై రణరంగమున కేఁగుటే యని నాయభిమతము.

అశ్వ : మాతులా ! ఇది నాయధీనములోనిది కాదు. కాన, పరిగణింపఁ దగనిది.

కృపు : వత్సా ; ఇది పరతంత్రమును గాదు. పరిగణింపఁ దగనిది కాదు. ఏలన :

క. గంగాతనయుఁడు ద్రోణుఁడు
నుం గలుగని కొఱఁత యెట్లునుం దీఱదు నీ
వుం గలిగి తుల్యయోగ్యత
సంగరమునఁ గొనవయేని సైనికరక్షన్. ౨౩

నీ యసమశరవిసరమునకు ముల్లోకములు నోపవు. ఇఁక యుధిష్ఠిరబల మెంత ? కురుపతికూడ నభిషేకసంభారములఁ గూర్చుకొని నీకొఱ కెదురుచూచు ననుకొందును.

అశ్వ : మామా ! నిజమే. పరిభవానల పరితప్యమాన మగు నామనస్సు ప్రతీకార మనుజలాభిషేకమును గోరుచున్నది. నే నేఁగి గురువధచే విషణ్ణమానసుఁ డగు దుర్యోధనుని జేరి సేనాధిపత్యస్వీకరణమున నతని నూఱడించెదను.

కృపు : వత్సా! మంచిది. మన మతనికడకే యేఁగుదము.

(ఇరువురును నడతురు.)

(కర్ణదుర్యోధనులు ప్రవేశింతురు.)

దుర్యో :

గీ. బంధుజనములు రిపులచేఁ బడ్డ దుఃఖ
పారమును శస్త్ర మనునావఁ జేరునట్టి
గురుఁడు సుతవధ వినికూడ ఘోరశస్త్ర
ములను గొనకేల విడిచె నా పొలికలనున? ౨౫

ఔను. ఎంతవారికిని సహజగుణము పోదని పెద్ద లనుమాట నిజము. శోకాంధబుద్ధియై క్షత్త్రియకర్కశతను విడిచి గురుఁడు బ్రాహ్మణ సులభ మగుదైన్యము నందినాఁడు.

కర్ణు : కౌరవేశ్వరా! అది కాదు.

దుర్యో : మఱేమి?

కర్ణు : అశ్వత్థామను భూలోకపట్టాభిషిక్తునిఁ జేయ నతని కోరిక. అది వ్యర్థ మగుటచే వృద్ధబ్రాహ్మణున కస్త్ర మేల యని విడిచినాఁడు.

దుర్యో : (తల యూఁచి) ఔనౌను.

కర్ణు : కౌరవపాండవపక్షపాతమున జరిగిన యీసంగ్రామములో రాజు లొండొరులు చావఁ గోరుటచేతనే యాతఁడు మన సేన లోని ప్రధానులచావు చూచియు నుపేక్షించినాఁడు.

దుర్యో : ఇదియు నిజమే.

కర్ణు : రాజా! ఆతనిగుణ మెఱిఁగినవాఁ డగుటచేతనే బాల్యహితుఁ డయ్యు ద్రుపదుఁ డీతనికిఁ దనరాజ్యమునఁ జోటీయలేదు.

దుర్యో : అంగరాజా! చక్కఁగా నూహించితివి.

కర్ణ : ఇది నాయూహయే కాదు. ఆతని నెఱిఁగినవారి యందఱి
దియు.

దుర్యో : ఔనౌను. సందేహమా ? అందుచేతనే

క. అతిరథుఁ డగుతా నభయము
నతికృప సైంధవున కిచ్చి యాపైని నరుం
డతనిని జంపఁగ నూరక
యితఁ డుండెను లేక వేఱ హేతువు గలదే ? ౨౩

కృపు : (చూచి) వత్సా ! కర్ణునితో దుర్యోధనుఁ డామఱ్ఱినీడఁ
గూర్చుండి యున్నాఁడు. సమీపింతము. (సమీపింతురు)

ఉభ : కౌరవరాజా ! జయము. జయము.

దుర్యో : (చూచి) ఏమి ? కృపాశ్వత్థామలా ? (ఆసనము దిగి)
గురూ ! వందనము. (అశ్వత్థామను జూచి) ఆచార్యపుత్త్రా !

ఉ. నాకొఱకై గతించిన గు
ణప్రభుసద్గురుపుత్త్ర ! కౌఁగిటన్
నాకొనరింపు హాయి కరు
ణన్ భవదీయశరీర మీననున్
దాఁకిన సద్గురూత్తముని
దాఁకినయట్టులె యై రవంతయేన్
శోకము పోవునేమొ పరి
శుద్ధపుమైఁబులకల్ జనింపఁగన్. ౨౪

(కౌఁగిలించుకొని కూర్చుండఁబెట్టుకొనును)

అశ్వ : (కన్నీరు విడుచును)

కర్ణ : ద్రోణతనయా ! ఈదుఃఖానలమున నేల పరితప్తుఁడ
వగుదువు ?

దుర్యో : గురుపుత్త్రా! ఈదుఃఖవిషయమున మన కిరువుర కభేదము. ఏలన :

ఆ. తండ్రి నీకు, నాకుఁ దండ్రికి హితుఁ డ స్త్రవిద్య నీకుఁ బోలెఁ బ్రియగురుండు
నాకు, నతనిచావు నీకు నాకును నా ర్తి
కరము, నీయెడంద యెఱుఁగు నెంతొ ? ౨౭

కృపు : వత్సా ! నిజము.

కర్ణు : అంతవిచార మెందులకు ?

అశ్వ : కురురాజా ! నీవు పంచుకొనుటచేతనే నాదుఃఖభారము కొంత తగ్గినది. కాని :

ఆ. నేను బ్రతికియుండ నిర్భాగ్యుఁ డొక్కఁడు
గురునిజుట్టు పట్టుకొనియె నకట !
ధరణి నింక నెవరు తనయులకొఱకునై
గంపెఁడాస బ్రతుకఁ గలుగువారు ? ౨౮

కర్ణు : ద్రోణతనయా ! నీ వేమి చేయుదువు ? సర్వావమానములను బోఁగొట్టుకొనఁ శక్తి గలిగియు నస్త్రసన్న్యాసమున నిట్టిదశ నీతండ్రి తానే తెచ్చుకొనెను.

అశ్వ : ఏమి చేయుదు ననియా న న్నడిగితివి ! నే నేమి చేయుదునో వినుము :

ఉ. పాండవసేనలోన ఘన
బాహుమదంబున నస్త్రధారులు
ద్దండు లెవారొ వారలను
ద్రౌపదిసంతతి బిడ్డబిడ్డనున్

మొండిగ నాఁడు సద్గురుని
మూర్ధవిఖండనఁ గన్నవారి నేఁ
జెండుదు నందఱన్ మిగుల
శీఘ్రమునన్ లయకాలరౌద్రతన్. ౨౯

మఱియు, నోభార్గవశిష్యా ! కర్ణా !

మ. తొలుతన్ భార్గవరాముఁ డొక్కరుఁడె శ
త్రుశ్రేణిరక్తంబు లీ
స్థలమందే ప్రవహింపఁజేసె నదియే
చందంబుగా మత్పితన్
దలనున్ బట్టినక్షత్రియాధముని మి
త్రశ్రేణితోఁ గూల్చి త
ద్బల మారామునిభంగి ద్రౌణి యొనరిం
పన్ జూడుమీ యిప్పుడే. ౩౦

దుర్యో : గురుసుతా ! నీ వట్టిప్రతిక్రియ చేయఁ గలయనన్యసాధారణవీరభావుఁడవు. నీ కీ డెవరు ?

కృపు : రాజా ! ద్రోణపుత్త్రుఁ డీవిధముగా సమరభారమును దలదాల్చినాఁడు. ఇతఁడు విల్లమ్ములు గైకొన్న ముల్లోకములు జయింపఁగలఁడు. ఇఁకఁ బాండవబల మెంత? కాన, నీ వీతనిని సేనాపతిగా నభిషేకింపుము.

దుర్యో : ఔను. కాని, యిదివఱకే యీపని కర్ణున కైపోయినది.

కృపు : రాజా ! సాటి లేనిపరాభవ మను దుఃఖసముద్రమున మునిఁగియున్న యీతనిని గర్ణునికారణమున నుపేక్షింపఁదగదు.

దుర్యో : ఆయరికులమునే కర్ణుఁడు సంహరించునుగదా ! దీని కేమి ?

B. David Raj

అశ్వ : కౌరవేశ్వరా ! ఇంకను మంచిచెడ్డలవిచార మేల ?

చ. సుకముగ నిద్రపోదు విఁక
 స్తోత్రములన్ బహువందిమాగధుల్
సుకవులు లేపుదాఁకఁ, గడు
 శూరత నేను నపాండవం బసో
మకము నకృష్ణమున్ భువన
 మండలిఁ జేయుదుఁ: దీర్చెదన్ ధరి
త్రికి భరమున్; రణాంత మగు
 దీన నృపాటవి ఖండితంబుగాన్. ౩౦

కర్ణ : అశ్వత్థామా ! అపాండవ మసోమక మకృష్ణ మనుటే కష్టము. ఇఁకఁ జేయు టెంతకష్టము ? కాని, కురుబలమున సమర్థు లున్నారులే.

అశ్వ : అంగరాజా ! నిజమే. నేను దుఃఖచిత్తమున శోకావేగ ముతో నంటిని గాని మనవీరుల నాక్షేపించుటకుఁ గాదు.

కర్ణ : మూఢా ! ఏడుపు వచ్చిన నేడువవలయును. కోపము వచ్చిన నాయుధసాహాయ్యమున రణమున దూఁకవలయును. అంతేకాని యీపనికిరానిమాట లెందులకు ?

అశ్వ : ఓరీ ! రాధకడుపు చెఱుపఁ బుట్టినవాఁడా ! చేతకాని సూతుఁడా ! ఏమి ప్రేలెదు ?

కర్ణ :

గీ. సూతుఁడనె యౌదు లేకున్న సూతసుతుఁడ
నౌదు: నెవఁడనో యొకఁడను వాదులేల ?
దైవవశ మగుఁ బుట్టుక; ధైర్యశౌర్య
పురుషకారంబు నావశంబుర యెఱుంగు. ౩౧

అశ్వ : ఏమిరా! ఏమంటివి? నాదుఃఖము నేడ్చియా పోఁగొట్టు కొనుమంటివి? శస్త్రప్రతిక్రియచేఁ గాదా! ఓరీ!

మ. గురుశాపంబున నీవలెన్ శరతతుల్
కుంఠంబులా? నావి, వీ
రరణంబున్ మును నీవలెన్ విడిచి పా
రంజొచ్చి యున్నాఁడనా?
మఱి స్తోత్రించుకులాన నీవలెను జ
న్మంబెత్తి యున్నాఁడనా?
యరి నస్త్రంబునఁ గాని యస్త్రమునఁ జే
యన్ లేనురా ఖండితున్? 33

కర్ణు : (క్రోధముతో) ఓరోరి దుర్విదగ్ధా! వృధాశస్త్రగ్రహా! బ్రహ్మచారీ! చెప్పు. చెప్పు.

గీ. నేను విడిచినయాయుధనికరము లని
వీర్యయుతముల? లేక నిర్వీర్యములుర?
పాండువీరులభీతి నొప్పఱిననీదు
బాహుశాలిమహాపితృభాణభంగి. 34

అశ్వ : ఓరీ! నీచసూతజా! బాణము పట్ట నెఱుఁగనివాఁడా! నాపితృపాదులను గూడ నాక్షేపించుచున్నావఁటరా?

ఉ. భీరుఁడొ శూరుఁడో గురుఁడు
విక్రమతన్ జగదేకవీరుఁడో
ఘోరరణక్రియన్ వసుధ
కున్ విదితంబు నిరంతరంబు, నే
కారణమో యతండు విడఁ
గార్ముక మమ్ములు సాక్షి ధర్మజుం,

దోరి! దురాత్మ! నీ వచట

నుండియుఁ బాఱితి వేలరా? ఖలా! ౩౫

కర్ణు: (నవ్వి) ఔనౌను. నేను భీరుఁడను! నీవు వీరుఁడవు. నీవిక్రమసారము చూడఁగా నీతండ్రివిషయములోఁ గూడ సంశయమే కలుగుచున్నది. ఓరీమూర్ఖా!

గీ. శస్త్రమును వీడినను నేమి? శౌర్యవంతు

లరి మహాయుధ మెత్తిన నడఁప లేరె?

రాజలోకంబుముందు శిరంబుఁ గోయ

నింతిగతి నీదుతండ్రి సహించెఁ గాని. ౩౬

అశ్వ: (క్రోధకంపములతో) ఓరీ! దురాత్మా! రాజవల్లభప్రగల్భా! సూతాపశదా! అసంబద్ధప్రలాపీ!

గీ. దుఃఖభరముననో భయదుర్బలతనొ

ద్రౌపదకరంబుఁ దండ్రి యదల్పకుండె;

దర్పయుత మగునీతలఁ దన్ని యెడమ

కాలు నిలుపుదు; వారింపు కలుగుదేని. ౩౭

(లేచి యెడమకా లెత్తును)

కృప దుర్యోధనులు: గురుపుత్త్రా! శాంతింపుము. శాంతింపుము.

కర్ణు: (క్రోధముతో లేచి కత్తిదూసి) ఓరీ! దురాత్మా! బ్రాహ్మణా! ఆత్మశ్లాఘీ!

గీ. బ్రాహ్మణుండవు కావున బ్రతికిపోతి

వోరి! తుచ్ఛుఁడ! నీ వెత్తియున్నకాలు

ముక్కముక్కలు కరవాలమున నొనర్చి

ధరణిఁ బడఁ గొట్టియుందును దక్షణంబు. ౩౮

అశ్వ : ఏమిరా! జాతికారణమున బ్రతికిపోతి నంటివా! ఇదిగో. నాజాతి నిదే విడిచివేసెదను. (జందెము ద్రెంచి పాఱవైచి కోపముతో) ఇఁక రమ్ము.

గీ. నిను వధింపఁగఁ బట్టునర్జునుప్రతిజ్ఞ
మిథ్య యొనరింతుఁ గాచుకొమ్మి! దురాత్మ!
అస్త్రమున రార! రాఁజాలవైతివేని
శరము ధర నిడి తాల్పు మంజలిని మౌళి. ౩౯

(ఇరువురును కత్తులు దూసి కలియఁబడఁబోవ దుర్యోధనకృపులు వారింతురు.)

దుర్యో : సఖా! గురుపుత్త్రా! శస్త్రమును ముట్టకు.

కృపు : వత్సా! సూతపుత్త్రా! శస్త్రమును ముట్టకు.

అశ్వ : మాతులా! ఏల వారింతువు? నాతండ్రిని నిందించిన యీసూతకులాధముఁడు నాకు ధృష్టద్యుమ్నసమానుఁడే.

కర్ణు : రాజా! నివారింపకు.

అశ్వ : రాజా! రానిమ్ము. రానిమ్ము. వీనిని నాసందిట నిఱికించుకొని నలిపివైచెదను. ఓయీ! కౌరవేశ్వరా! స్నేహముననో కార్యముననో నీవు నాతండ్రిని గాఱులుకూసిన యీ దురాత్ముని దుర్మదుని గాపాడఁ గోరుచుంటివి. నీ కీరెండును నిరుపయోగములే. ఏలన!

గీ. సుగుణవంతుఁడ వీవు! ఈతఁడు పాపి,
ఇందుకులుఁడవు నీ వౌదు, వితఁడు సూత
సంభవుఁడు, మైత్రి యెట్లు పొసంగు మీకు?
ఇల నకర్ణార్జున మొనర్తు నిపుడె నేను. ౪౦

(నఱుకఁబోవును)

కర్ణు : (కత్తి దూసి) వృథాచపలబ్రాహ్మణా! ఇఁక నీ వుండవురా! రాజా! విడువుము. విడువుము, న న్నిఁక వారింపకుము. ఏలన !

గీ. ధీరసత్త్వుఁడు జడు నవధీరణమునఁ
గోపమును మ్రింగి సైరింపఁ గూళ యగుట
దుర్మదాతిశయంబునఁ దొడఁగుఁ దానె
తన మంగటిమి కీర్తించుకొనఁగ నతఁడు. ౪౧

(నఱుకఁబోవును. కృపదుర్యోధనులు వారింతురు)

దుర్యో : ఓయి కర్ణా ! గురుతనయా ! మీ యిరువుర కీపిచ్చి యేమి ?

కృపు : వత్సా ! మన మిపుడు చేయవలసిన దొకటి. పైఁబడిన దిది. ఈసమయమున మన మహారాజున కాత్మబల వినాశనము నీ వలన నగుట మంచిది కాదు.

అశ్వ : మామా! సూతుకులకళంకుఁ డగు నీ ప్రేలరిదర్ప మణఁప వలనుపడ దయ్యెనుగదా :

కృపు : నాయనా ! మన బలమునఁ గలప్రధానితో నిట్టి విరోధ మున కిది యదను గాదు.

అశ్వ : సరే కానిమ్ము !

మ. అనిలోఁ దాఁకి విరోధిబాణములు పా
పాత్ముండు కర్ణుండు భూ
మిని దాఁ గూలెడిదాఁక శస్త్రమును దా
ల్మిన్ నేను వర్జింతు రా
జును గాంచున్ బ్రియమిత్త్రుబాహుబలవి
స్ఫూర్తిప్రభావంబున

ర్జునభీమప్రవిభీతుఁడై పఱవఁ గ
ర్ణుం. డంత నన్ విల్చెడిన్. ౪౨

(కత్తి విడుచును.)

కర్ణు: (నవ్వి) నీ వంటివాఁ డాయుధమును గైకొన్న నది యెపుడో విడిచినట్లే లెక్క. మఱియు,

చ. కరమున నేను ఖడ్గమును
గైకొనియుండఁగ నింకొకండు తాఁ
గరమున నేల ఖడ్గమును
గైకొనుటల్ ? తలపోయ, నింక నా
కరమున నున్నఖడ్గ మది
కాంచఁగఁ జాలనికార్య మున్న నే
కరమున నున్న ఖడ్గమును
గాంచఁగఁజాలమి తథ్యమౌఁగదా! ౪౩

(తెరలో)

ఓరోరి దురాత్మా! ద్రౌపదిసిగఁ బట్టి బట్ట లొలిచినపాపీ! ధృతరాష్ట్రపుత్రాధమా! ఇంతకాలమునకు నాయెదుటఁ బడితి విరా. నీచపశువా! ఇపు డింక నెట కేఁగఁగలవు? ఓరోరి కర్ణా! సౌబలదుర్యోధన ప్రభృతులారా! మానధను లగు మీ రందఱును వినుఁడు.

చ. కురుసభలోన నేపశువు
కోమలిద్రౌపదిజుట్టు పట్టి యె
ల్లరుఁ గనఁ గట్టఁబుట్టములు
లాగఁగ నెంతయు సాహసించె, నే

నరునియురంబునెత్రు కద
నంబునఁ ద్రావుదు నంటి. వాఁడు నా
యురుభుజపంజరంబునను
నుక్కడఁ ద్రోవుఁడు శక్తిగల్గినన్. ४४

(అందఱును విందురు.)

అశ్వ: అంగరాజా! సేనాపతీ! పరశురామశిష్యా! ద్రోణాపహాసీ! భుజబలపరిరక్షితసకలలోకా! ("కరమున నేను...." అను పద్యము మరలఁ జదివి) ఇపుడేకదా యంటివి! దాని కిదే యదను వచ్చినది. ఇదిగో చేతనైన భీమునిభుజపంజరమునఁ బడ్డ దుశ్శాసనుని రక్షింపుము!

కర్ణు: ఏమి? నేను బ్రతికియుండఁగా యువరాజునీడనైనను భీముఁ డంట శక్తుఁడా? యువరాజా! భయపడకు. భయపడకు. ఇదే వచ్చుచున్నాను. (నిష్క్రమించును.)

అశ్వ: రాజా! దుర్యోధనా! భీష్మద్రోణులు గతించిన కారణమున భీమార్జునులు కౌరవబలముల నుఱుమాడుచున్నారు. వారిని గర్ణాదు లెవ్వరు నాఁపఁజాలరు. కావున నీవే స్వయముగ నేఁగి తమ్ముని రక్షించుకొనుము.

దుర్యో: అఁ. ఎవఁడు శక్తుఁడు? నే నాయుధహస్తుఁడనై యుండఁగా దురాత్ముఁ డగుభీముఁడు కాని మఱెవఁడు కాని నా తమ్ముని నీడనైనను ద్రొక్కఁగలఁడా? వత్సా! దుశ్శాసనా! భయపడకు. భయపడకు. ఎవఁడురా యక్కడ? రథము రథము.

(నిష్క్రమించును.)

(తెరలోఁ గలకలము)

అశ్వ : (ముందు చూచి) మాతులా ! ఎంతకష్టమోయి ! భ్రాతృప్రతిజ్ఞాభంగభీరుఁ డగునర్జునుఁడు కర్ణదుర్యోధనులను శతవర్షములచే ముంచివైచి పైఁబడుచున్నాఁడు. అయ్యో ! కష్టము. కష్టము. భీముఁడు దుశ్శాసనునురము వ్రచ్చి రక్తముఁ గ్రోలుచున్నాఁడు. దుర్యోధనమహారాజుతమ్ముని యీదుస్థితి నేను గనఁజాలకున్నాను. ప్రతిజ్ఞకు భంగమైన నగుఁగాక ! మామా ! కత్తి. కత్తి.

గీ. సత్యమునకన్న ననృతంబె చాలమంచి ;
దరయ స్వర్గము నాకేల నరక ముండ ?
దుస్ససేనునిఁ గాపాడుదు; నిఁక. నన్ను
విడిచియున్నశస్త్రంబు నే విడువఁజాల. ౪౫

(కత్తిఁ బట్టఁ బోవును.)

(తెరలో)

ఓయీ ! మహాభాగా ! శారద్వతీపుత్రా ! అసత్య మెన్నఁ డెఱుఁగనినీ వీవిషయమున సత్యవ్రతభంగ మొనరించుకొనకుము.

కృపు ! వత్సా! అశరీరవాణి నిన్నసత్యదోషమునుండి కాపాడుచున్నది.

అశ్వ : ఆహా ! అమానుషవాక్కుకూడ నారణసంరంభమును వారించుచున్నది. కష్టము ! కష్టము ! దేవతలుసైతము పాండవపక్షపాతమున నున్నారు. భీమసేనుఁడు దుశ్శాసనుని రక్తము తెగఁద్రాగుచున్నాఁడు. అయ్యో ! కష్టము. కష్టము.

గీ. దుస్ససేనునురంబునెత్తురులు భీముఁ
డిటులు విచ్చలవిడిఁ గ్రోల నేమి సేయఁ

జాలకుంటిని, నే నింక సమరమందు
నేమి దుర్యోధనునకుఁ బెం పీయఁగలను ?

మాతులా ! కర్ణునిమీఁదికోపమున నేను జేయరానిపనియే చేసితిని, నీ వైనను రాజునకుఁ గుడిభుజమవై యుండుము.

కృపు : సరే. నే నేఁగి దీనికిఁ బ్రతిక్రియ చేయుదును. నీవు శిబిరమున కేఁగుము.

(నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

# చతుర్థాంకము

(దెబ్బ తిని మూర్ఛ నంది రథమున నున్నదుర్యోధనునితో

సూతుఁడు ప్రవేశించును.)

సూతు : (సంభ్రమముతో నడచును.)

(తెరలో)

ఓ కౌరవపక్షపాతు లగురాజన్యులారా! ప్రాణధనముల నఱచేతఁ బట్టుకొని బాహుబలగర్వమున సమరసన్నద్ధు లైన మీరు పాఱి పోక నిలువుఁడు. భీముఁడు దుశ్శాసనుని వక్షస్థలము వ్రచ్చి రక్తము త్రాగి మిగిలినరక్తము నొంటికిఁ బూసికొని మహా భయంకరవేషమున నుండుటఁ గని మనసైనికు లాయుధములు విడిచి వెనుదిరుగక పరువిడు చున్నారు.

సూతు : (చూచి) ఓహో! ధవళకపిల చామరచుంబిత కనకదండమున శిఖరావబద్ధ మగువైజయంతి సూచితము కాఁగా, చచ్చి పడియున్న మనుష్యహయగజకళేబరసహస్రములచే నెత్తుపల్లములుగా నున్నరణభూమిని నడపుచుండుటచేఁ జిఱుగంటలు మ్రోయురథ మెక్కి నిజబలపరాక్రమమున శత్రుశరవర్షము నడఁగించుచుఁ దనబలముల నూఱడించుచుఁ గృపాచార్యుఁడు త్వరితగతి నేఁగి కిరీటితోఁ బోరుచున్న కర్ణునకుఁ జేదో డయ్యె. ఇప్పటికైనను గురుబలముల కవలంబనము దొరకినది.

(తెరలోఁ గలకలానంతరము)

భీమ : నన్నుఁ గన్న భయమున విల్లమ్ములను గత్తికటారులను జాఱవిడుచు కౌరవచమూభటులారా ! పాండవపక్షయోధులారా! భయపడకుఁడు. నేను దుశ్శాసనుని జంపి యాతనియెఱంద నెత్తురులు తనివితీఱఁ గ్రోలిన గర్వమున నింకఁ గొంచెము మిగిలియున్న ప్రతిజ్ఞానిర్వహణమునకుఁ దొందరపడుచున్న పార్థమధ్యముఁడను. జూదమున నోడిపోయిన దాసుఁడను. భీమసేనుఁడను. మీ రందఱు సాక్షులై వినుఁడు.

మ. విలు చేతం గొని మానవంతుఁ డయి నన్
వీక్షింప దుర్యోధనుం
డల కర్ణుండును శల్యుఁడున్ గృపుఁడు యో
ధాగ్రేసరుల్ చూడ మి
త్రులు కాంచంగను ద్రౌపదీవసనక
ర్షున్ గోళులం జీల్చి యిం
పులు గుల్కంగఁ గవోష్ణరక్తమును స
మ్మోదంబుతోఁ గ్రోలితిన్. ౧

సూతు : (విని భీతితో) అయ్యో ! కౌరవపుత్త్రాటవిఁ గూలఁ గొట్టు వాయుదేవుఁ డగుభీమసేనదురాత్ముఁ డిటే వచ్చుచున్నాఁడు. మహారాజింకను మూర్ఛ దేఱలేదు. రథమును దూరముగాఁ బోనిత్తును. లేనిచో నీతనినిగూడ దుశ్శాసనునివలెనే యేదేనినార్యకార్యము చేయవచ్చును. (త్వరగాఁ దోలి చూచి) ఇదిగో ! ఇట నొకపెద్దమఱిచెట్టున్నది. ఈ సన్నిధిని గలచెఱువులోని పద్మముల సువాసన గలగాలిచే దీనియాకులు గదలుచున్నవి. సమరపరిశ్రమముచే నలసిన వీరుల కిది యుచితవిశ్రాంతిస్థలము. ఇట నయాచితముగా మంచిగందపుఁజలువయుఁ జక్కని సువా

సనయుఁ గలిగి చచ్చినవానికిఁ గూడఁ బ్రాణము లేచివచ్చు నట్లు చక్కఁగా వీచుచున్న యీసరోవరవాయువుల సోఁకుడుచే మహారాజు తేలుకొనును. ఈరథమునకుఁ గల కేతు విదివఱకే శత్రువులచే భగ్నమయి యుండుటచే నేయడ్డును లేకుండ దీని నీ చెట్టుక్రిందకుఁ బోనిచ్చెదను. (అట్లు చేసి) ఎవ రిక్కడ! (కలయఁ జూచి) పరిజనుఁ డెవ్వఁడును గానరాఁడాయె ! ఆవిధమున నున్న భీమసేనుని, ఈవిధమున నున్న మహారాజును జూచి భయపడి యెల్లరు శిబిరమునే చేరియుందురు. అయ్యో ! కష్టముకదా !

చ. గురుఁ డురురక్ష యిచ్చినను
గూల్చెఁ గిరీటి జయద్రథున్, భయం
కరముగ భీముఁ డిట్టులు మృ
గంబును జీల్చినయట్లు చీల్చె నీ
కురుపతితమ్మునిన్. రిపుల
ఘోరము లైనప్రతిజ్ఞ లెల్లఁ జె
ల్చెర సులభంబు లయ్యె, మన
సేనకు దైవమె శత్రువయ్యెఁగా ! 2

(రాజును జూచి) ఇప్పటికి మహారాజు తేలుకొననే లేదు. అయ్యో ! కష్టము. కష్టము. (నిట్టూర్చి) ఓమహారాజా !

గీ. మదగజము నాశనము చేసి మగుడ, వనిని
మిగులు నేకైకవృక్షంబుపగిది నకట !
కురుకుమారకు లందఱు మరణమంద
నీ వొకండవు మిగులుట దైవదయను, 3

ఓయీ ! హతవిధీ ! భరతకులవిముఖా ! నీదయచే

గీ. అక్షత శరీరుఁడై గద హస్తమందుఁ
దనర సంశయ మొకయింత తగులకుండ
భీమసేనుఁడు కొఱవడ్డ యీమహా ప్ర
తిజ్ఞ కూడను నెఱవేర్పుఁ దెగువ మీఱ. ౪

దుర్యో : (మూర్ఛదేఱి ధైర్యముతో) ఏమి ! దుర్యోధనుఁడ నగు నేను బ్రతికియుండఁగా దురాత్ముఁ డగు వృకోదరహతకుని ప్రతిజ్ఞ యెట్లు నెఱవేఱును ? వత్సా ! దుశ్శాసనా ! భయపడకు. భయపడకు. నే నిదే వచ్చుచున్నాను. సూతుఁడా ! సోదరుని కడకు రథమును బోనిమ్ము.

సూతు : ఆయుష్మంతుఁడా ! గుఱ్ఱములు రథమును మోయఁ జాలవు. (అపవారించి) మేమును నీమనోరథమును....

దుర్యో : (రథము దిగి సగర్వముగను సాకూతముగను) ఈరథమున విలంబనము నాకేల ?

సూతు : (వైలక్ష్యముతోడను జాలితోడను) ఆయుష్మంతుఁడా ! శాంతింపుము. శాంతింపుము.

దుర్యో : ఛీ ! నాకు రథ మేల ? నే నొంటరిగనే శత్రుమర్దన సంఘట్టనసంచారి నగు దుర్యోధనుఁడనుగదా ! గదామాత్ర సహాయుఁడనై సమరాంగణముఁ జొత్తును.

సూతు : ఆయుష్మంతుఁడా ! నీ వంతవాఁడవే. సంశయమేమి ?

దుర్యో : ఐన, నీ విట్లు పలుకుదు వేల ? చూడు.

ఉ. పాపపుభీమసేనుఁ డిటు
బాలుని దుర్లలితున్ సమక్షమం
దే పగ దీర్పఁ బూని యిటు
లెత్తెఁగదా ! గద దానిఁ గాంచి నే

నాఁపఁగఁ బోవుచుండ నిటు
లాఁపెదవేల ననున్, దలంపఁగాఁ
గోపము లేదొ? లేదొ దయ?
కూడునె నీ కిటు? సిగ్గు లేదొకో? 8

సూతు : (సకరుణముగాఁ గాల్లపైఁబడి) ఆయుష్మంతుఁడా! ఆ దురాత్ముఁ డగు వృకోదరహతకుఁ డీపాటికే తన ప్రతిజ్ఞ పూర్తిగా నెగ్గించుకొనియుండు ననియే నే నట్లంటిని.

దుర్యో : (వెంటనే భూమిపైఁ బడి) అయ్యో! వత్సా! దుశ్శాసనా! నా యాజ్ఞమూలమునఁ బాండవులకు విరోధివైతివి గదా! విక్రమమే రసముగాఁ గలనీవు నాయంకమున లాలింపఁ బడుచుండెడివాఁడవు. నీవు శత్రుకులగజసంతతికి సింహసన్నిభుఁడవు. అయ్యో! యువరాజా! పలుకవేమి? ప్రతివచన మిమ్ము.

(నిశ్వసించి మూర్ఛిల్లును)

సూతు : రాజా! శాంతింపుము. శాంతింపుము.

దుర్యో : (తేఱుకొని నిట్టూర్చి)

చ. సకలమహోపభోగసుఖ
సంతతి కర్హుఁడ వైన నీకు నే
నకట! ఘటింపనైతి నది
యగ్రజజన్మము నాది వ్యర్థమో
నకుటిలు నిన్ను ద్రౌపదిని
నట్టులు నాఁడొనరింపఁ బంపి నీ
వికటమునందు నుండియును
నేఁ డెటు గావఁగఁ జాలనైతి నిన్! (మూర్ఛిల్లును)

సూతు : ఆయుష్మంతుఁడా ? ఊఁడిల్లు మూఁడిల్లుము.

దుర్యో : (లేచి) అయ్యో ! సూతుఁడా ! నీ వెట్టిపని చేసితివి ?

గీ. బాలు, నాజ్ఞానువర్తిఁ, గాపాడఁదగిన
యనుఁగుఁదమ్ముని, దుశ్శాసనుని విరోధి
కకట ! చేసేఁత బలియిచ్చినట్టినాఁడు
ప్రాణములఁ గాచినాఁడవు పాపి రణము. ౬

సూతు : ఆయుష్మంతుఁడా ! మర్మభేదకము లగుబాణములచేతను శక్తితోమరప్రాసవర్షములచేతను మహారథు లచేతనులై పడిపోఁగా నీవును మూర్ఛిల్ల రథము నిటు మరలించి తోలుకొని వచ్చితిని.

దుర్యో : సూతుఁడా ! నీవు విరుద్ధమే యొనరించితివి, ఏలన :

చ. అనుజవిరోధి యైనపవ
నాత్మజుఁ డన్పశుతుల్యు హస్తమం
దునఁ గలవజ్రతుల్యగద
దుర్భరహింసయె నాకుఁ గల్గ దేఁ
యెనుగద ! కల్గియున్నెడల
నేనో యతండో యనుంగుదున్పనే
నునిరుధిరార్ద్రిశయ్యకడ
నొచ్చియె యుందుముకాదె ! సూతుఁడా ! ౭

(నిట్టూర్చి, ఆకసముఁ దిలకించి) అయ్యో ! హతవిధీ ! కృపారహితా ! భరతకులవిముఖా !

గీ. ఇపుడె మృత్యువు నన్ గ్రహియించుఁగాక !
భ్రాతృహంత భీమునిగదఁ బడఁగఁ జాల.

సూతు : పాపము శాంతించుఁగాక ? పాపము శాంతించుఁగాక !
ఏమిది మహారాజా !

దుర్యో : సకల బంధుజనంబులఁ జంపుకొన్న
హతకుఁడను నాకు జయము రాజ్యంబు నేల ? ౯

(అంత దెబ్బలుతిన్న సుందరకుఁడు ప్రవేశించును)

సుంద : ఆర్యా ! సారథి తప్ప నన్యులు లేని దుర్యోధనమహారాజు నీ పరిసరమున నెవరైనఁ జూచియున్నారా ? ఎవరును బదులుపలుకరే ! కానిమ్ము. అక్కడ నెవరో బద్ధపరికరు లగు నుద్ధతశరీరులు కనఁబడుచున్నారు. అట కేఁగి వారి నడుగుదును. (చూచి) ఏమి ! వీరు గట్టిగా దెబ్బతిన్న తమరాజు హృదయమున గ్రుచ్చుకొన్న బాణముఖములను నెమ్మదిగాఁ దీయుచున్నారు. వీరి కాగొడవ తెలిసియుండదు. కానీ, ఇంకొకచోటి కేఁగి యడుగుదును. ఇట నెవరో, వీరపురుషు లున్నారు. వీరి నడుగుదును. (చేరి) ఏమండీ! కురురా జెట నున్నాఁడో యెఱుఁగుదురా? ఏమి ! వీరు గోలుగోలున నేడ్చుచున్నారు ! (చూచి) అయ్యో ! ఇట నెంతఘోరము జరుగుచున్నది ! సమరమునఁ జచ్చినకొడుకుసంగతి విని యీవీరమాత సమగ్రభూషణ యగు కోడలితోఁ గూడి యగ్నిప్రవేశము చేయుచున్నది. (మెచ్చుకొని) జయము. వీరమాతా ! జయము. నీకు మఱుజన్మమునఁ బుత్త్రశోకము లేకుండుఁగాక ! మఱియొకచోఁ జూచెదను. (చూచి) ఆహా! దేహమునిండ దెబ్బలవలన గాయములు పడినను వానికి మందుమాఁకులు రాసికొనక యీవీరులు శూన్యాసనముతో నున్న యీగుఱ్ఱమును జూచి విచారించుచున్నారు. వీరినాయకుఁడు రణమునఁ జచ్చియుండనోపు. వీరికిని దెలియదు. కానీ. ముందు

కేగుఁదును. (ఏఁగి) ఏమిది! జనులందఱును దమతమ యవస్థానురూప మగుదుఃఖమున మునిఁగియున్నారు. వీరి నెవరి నడుగుదును? ఎవరిని నిందింతును! కానీ. నేనే నిందించుకొందును. (నడచి) కాదు. దైవమును నిందింతును. ఓదైవమా! ఏకాదశాక్షౌహిణులకు నాయకుఁడు, భ్రాతృశతమువ నగ్రజుఁడు, గాంగేయ జయద్రథ ద్రోణాంగరాజలోకమునకుఁ బ్రభువును, సకలపృథివీమండలైకనాథుఁడు నగు దుర్యోధనమహారాజును నాచే వెదకించుచున్నావు! అతఁ డెట నున్నాఁడో తెలియ రాదాయె! (ఆలోచించి నిట్టూర్చి) దైవనింద యేల? ఇది యంతయు నిరాకృతవిదురవచనబీజమును, బరిహృత పితృపితామహోపదేశాంకురమును. శకునిహతకప్రోత్సాహ విరూఢమూలమును. లాక్షాగృహద్యూతవిషవృక్షము చిరకాలమునుండి పెచ్చు పెరిఁగివచ్చుచున్న వైరమున కాలవాలమై పాంచాలీకేశగ్రహణ సుమములఁ బూచి నేఁటి కీఫలము నిచ్చినది. (మఱొకచోఁ జూచి) పెక్కుమణులకాంతి గలిగి సూర్యకాంతివలె దిగంతముల నింద్రధనుస్సులఁ బుట్టించుచు జెండాయు నొగలును ఖండితములుగాఁ గానఁ బడుచున్న దారథము, అవశ్య మటనే మహారాజు విశ్రమించి యుండవలయును. (పోయి చూచి నిశ్చయించి) జయము. జయము. మహారాజా!

సూతు : ఆయుష్మంతుఁడా! రణరంగమునుండి సుందరకుఁ డేతెంచినాఁడు.

దుర్యో : ఓయీ! సుందరకా! అంగరాజు కుశలమా?

సుంద : శరీరమాత్రమున.

దుర్యో : (తొందరపాటుతో) సుందరకా! కిరీటి యాతనిగుఱ్ఱములు సారథిసహిత మగురథమును నాశనము చేసెనా ?

సుంద : దేవా! రథమే కాదు. మనోరథమును కూడ.

దుర్యో : ఏమిరా! అసలే విచారపడుచున్న మనమును సందిగ్ధ వచనములచే మఱింత బాధపెట్టెదవేల? స్పష్టముగాఁ జెప్పు.

సుంద : దేవా! దేవరకిరీటమణికాంతివలన నాబాధ కొంత యుపశమిల్లినది. (సాటోపముగా) దేవా! వినుము. దుశ్శాసనకుమారుని చావు.... (నోరు మూసికొనును)

సూతు : సుందరకా! అది యిదివఱకే తెలిసినది. తరువాత?

దుర్యో : తరువాత నేమైనది ?

సుంద : దేవా! వినుము. దుశ్శాసనకుమారునిచావుచేఁ గోపియై యంగరాజు దురాచారుఁడు పాండవమధ్యముఁడు నగుభీమసేన హతకునిపైఁ గుటిలభ్రుకుటీభంగభీషణలలాటపట్టియై బాణము తొడుగుట విడుచుట యనునవి తెలియని మహావేగమున శర పరంపరఁ గురియించెను.

దుర్యో : పిమ్మట ?

సుంద : పిమ్మట దేవా! రెండుసేనలయందు నున్నకరితురగాది పరస్పరఘర్షణమున బయలువెడలినధూళివలనను, బెద్దయేనుఁగులగుంపులవలనను గలిగిన యంధకారము క్రమముగా నిరువాగులను నంధీభూతము చేసివైచినది. భూభాగమే కానరాదాయెను.

దుర్యో : తరువాత !

సుంద : తరువాత దేవా! కర్ణభీము లిరువురు చేయు నొంత్తారుల సింహనాదము లనునుఱుములచేతను, ఒకరిపై నొకరు వేసి

క్రొన్న బాణపరంపరలకు రాలుకవచఖండములనుమెఱుపులచేతను నారియొడళ్ళఁ గాఱురక్తబిందువు లనుమెఱుఁగుడుఁ బుర్వుల చేతను నిరంతరము మ్రోయుధనువు లనుమేఘములు ధారాపాత ముగా వర్షించినసమరదుర్దినము సంభవించెను.

దుర్యో : ఆపై ?

సుంద : ఆపై దేవా ! ధనంజయుఁ డగ్రజునకుఁ బరాభవము కలుగు ననుభయముతో వజ్రపాతదారుణ మగురథధ్వనితోడను, గుఱ్ఱములసకిలింపులతోడను రథశిఖరమునఁ గల కపిధ్వ జముకాంతికిఁ గన్నులు మిఱుమిట్లు గొలుప శంఖచక్రగదా ఖడ్గములు నలుకరముల నలరుచుండుకృష్ణుఁడు నొగలపైఁ గూర్చుండి గుఱ్ఱములపగ్గములు పట్టుకొనఁ బాంచజన్యదేవదత్త ములఁ బూరింప బయలువెడలినమహాధ్వని దశదిశలను జెవుడు పఱుప శరవేగమున నటకు వచ్చిపడెను.

దుర్యో : ఆతరువాత ?

సుంద : ఆతరువాత భీమార్జునపరివృతుఁ డగుతండ్రిని జూచి సంభ్రమమునఁ దలనుండి జాఱిపడిపోయినరత్నశీర్షమునైన నెఱుంగక, ఆకర్ణాంతము లాగినవింటినారితో దక్షిణహస్తమున నుంచినశరపుంఖబంధనమున సారథిని ద్వరగాఁ బోనిమ్మని హుంకరించుచు వృషసేనకుమారుఁ డొక్కక్షణములో నట కరుదెంచెను.

దుర్యో : (గర్వముతో) తరువాతఁ దరువాత ?

సుంద : వచ్చియు రాకమునుపే వృషసేనుఁడు విదలితాసిలతా శ్యామలస్నిగ్ధపుంఖములు, కఠినకంకపత్త్రములు. కృష్ణవర్ణములు నగుశిలానిశితశ్యామలశల్యబంధములను బహుముఖములఁ బఱపి

క్షణములోఁ బూచినమోదుగువలె నర్జుననిరథమును బాణము లతోఁ గప్పివైచెను.

దుర్యో : (సంతోషముతో) అపుడు ?

సుంద : అపుడు దేవా ! అర్జునుఁడు నిశితబాణముల నెన్నిటినో యాతనిపైఁ బఱపి చిఱునవ్వుతో "నోరోరివృషసేనా ! నీ తండ్రియే నాయెదుట నిలువఁజాలఁడయ్యె, బాలుఁడ వగు నీవా నన్నెదిరింపఁ గలుగుట ! పొమ్మ. బాలుఁడా ! నీవంటి బాలురతోఁ బో రొనరింపు" మని పలికెను. ఈమాటలు విని వృషసేనుఁడు తండ్రి నాక్షేపించినాఁ డన్నకోపముచే మొగ మెఱ్ఱవడ భ్రుకుటీభంగభీషణ మగువిజృంభణమున మర్మభేదకము లగు పరుషబాణములు చెవులు సోఁకఁ బఱపెఁ గాని పరుషవచన మొక్కటియుఁ బలుకఁడయ్యెను.

దుర్యో : సెబాస్ ! వృషసేనా ! సెబాస్ !

సుంద : వృషసేనునినిశితబాణములు సోఁకుటచే నధిక మగు కోపమును గన్నయర్జునుఁడు చండగాండీవజీవాశబ్దనిర్జితవజ్రనిర్ఘాతఘోషమున బాణనిపతనప్రతిషిద్ధదర్శనప్రసరణమున నిజశిక్షాబలానురూప మగురణకృత్యమును నిర్వహించెను.

దుర్యో : (సాకూతముగా) తదనంతరము ?

సుంద : తదనంతరము దేవా ! అర్జునునిసమరచతురతఁ గన్న వృషసేనుఁడును నమ్ములపొదిఁ జేయి యుంచుటయు నాకర్ణాంతము నారి లాగుటయు, నమ్ము దొడుగుటయు, నుద్ధురముగ విడుచుటయు నెవరికిని దెలియరాకుండఁ దనయుద్ధనైపుణ్యముఁ జూపఁదొడంగెను.

దుర్యో : అంత ?

సుంద : అంత దేవా ! యిరువాగులవారును సమరము నిలిపి క్రోధము మఱచి యీవీరు లిరువురు చేయుచిత్రయుద్ధమును బరికించి "వృషసేనా ! సెబాస్. సెబా'' సని వీరలోక మంతయు నొక్కుమ్మడిఁ బ్రశంసించెను.

దుర్యో : (ఆశ్చర్యముతో) అపుడు ?

సుంద : అపు డవధీరితసకలధానుష్కచక్రపరాక్రమశాలియగు కుమారునిరణకౌశలమును గని హర్షరోషకరుణాసీత్కార సంకటములతో నంగరాజు భీమసేనునిపై బాణపరంపరఁ బరగించి వృషసేనకుమారునిపై బాష్పపర్యాకులదృష్టిని నిగిడించెను.

దుర్యో : (భయముతో) అపు డేమి జరిగినది ?

సుంద : ఉభయబలములు వృషసేను నట్లు ప్రశంసించుటఁ గని యర్జునుఁడు మండిపడి శరవర్షమును వృషసేనుని గుఱ్ఱములపై సారథిపై, రథముపై, ధనుస్సుపై. నారిపై, నరేంద్రలాంఛనమగుసితాతపత్రములపైఁ గురియించెను.

దుర్యో : (భయముతో) అనంతరము ?

సుంద : అనంతరము విరథుఁడు, లూనగుణకోదండుఁడు నగు వృషసేనుఁడు శత్రుబాణపరంపరలను మండలగతిని బరిభ్రమించుచుఁ దప్పించుకొనుచుండెను.

దుర్యో : (ఆశంకతో) ఆపై ?

సుంద : తనకుమారునిరథము భగ్నమైనదే నని కోపించి యంగరాజు భీమసేనునిపై లక్ష్యము తొలఁగించి యర్జునునిపై వాఁడితూఁపులఁ బ్రయోగింపఁదొడఁగెను. ఇంతలోఁ బరిజనుఁడు కొనివచ్చినమఱియొకరథ మెక్కి వృషసేనుఁడు మరల ధనంజయాభిముఖుఁడై "ఓరిమధ్యమపాండవా ! నాతండ్రి నాక్షేపింతు

వఁటరా ! నాబాణములు నీశరీరముపైఁ దప్ప నితరములకుఁ బోనొల్లకున్నవి. కాచుకో'' యని శరసహస్రములను గురి యించి పేరెలుఁగునఁ బెద్దసింహనాదము నొనర్చెను.

దుర్యో : (ఆశ్చర్యముతో) ఆహా ! ముగ్ధస్వభావుఁ డయ్యు నీబాలుని విక్రమ మెంతటిది ! తరువాత ?

సుంద : అపుడు ధనంజయుఁడు వాని నెల్ల ఖండించి తనరథం బునఁ గలకనకకింకిణీజాలఝుంకారవిరావిణి, మేఘోపరోధ విముక్తనభస్థల, నిర్మలానిశితశ్యామలస్నిగ్ధముఖి, వివిధ రత్న ప్రభాభాసుర, భీషణరమణీయదర్శన యగుశక్తిని గైకొని నవ్వుచు వృషసేనునెదుట విడిచెను.

దుర్యో : (విచారముతో) అంత !

సుంద : అట్లు కిరీటి విడిచినశక్తి ప్రజ్వలించుచు వృషసేనుని దెసకు వచ్చుచుండుటం గాంచిన కర్ణునకుఁ జేతినుండి బాణ ములతోఁ గూడ ధనుస్సును, హృదయమునుండి వీరోచిత మగునుత్సాహము, కన్నులనుండి బాష్పబిందువులు, ముఖము నుండి వికాసము నొక్కుమ్మడి జాఱిపోయెను. అర్జునుఁడు చిఱునవ్వు, వృకోదరుఁడు సింహనాదము, పరగించిరి. కురు బలము లతిదారుణ మతిదుష్కర మని యాక్రందించె.

దుర్యో : (విచారముతో) తరువాత ?

సుంద : అంత వృషసేనుఁ డొక యర్ధచంద్రబాణము వింట సం ధించి యాకర్ణాంతము నారిని లాగి యాశక్తిపై విడువఁగా నీశ్వరునిచేఁ ద్రిధాకృతమొనర్పఁబడిన గంగానదివలె నర్జునుని శక్తి త్రిధాఖండిత మయ్యెను.

దుర్యో : సెబాస్, వృషసేనకుమారా ! సెబాస్.

సుంద : పిమ్మట సమరాంగణమున మహాకోలాహలముతోడను వీరలోకసాధువాదములతోడను సమరతూర్యనాదములు వినరావా యెను. సిద్ధచారణగణము లాకసమునుండి వర్షించిన పుష్పవర్ష ముతో రణతలము నిండిపోయెను.

దుర్యో : తదనంతరము ? ఏమి యీబాలవీరునిపరాక్రమము!

సుంద : అంత నంగరాజు భీమునితో "నోయీ! మనయుద్ధ మిం కను ముగియలేదు. ఒకక్షణ ముపేక్షింపుము. నాపుత్త్రునియు మీతమ్మునియు ధనుర్వేదశిక్షానై పుణ్యము క్షణమాత్రము చూత ముగాక !" యన భీముఁ డందులకు సమ్మతించెను. ఇరువురు నట్లు ముహూర్తమాత్రము వైరమును మఱచి వృషసేనార్జు నులఁ జూచుచుండిరి.

దుర్యో : (సాభిప్రాయముగా) తరువాత !

సుంద : అపు డర్జునుఁడు తనశక్తి ఖండిత మైన దనురోషమున "నోరోరిదుర్యోధన...." (అని వెనుదీయును)

దుర్యో : సుందరకా! చెప్పు. చెప్పు. అది పరవచనముకదా !

సుంద : దేవా! వినుము. "ఓరోరి దుర్యోధన ప్రభృత కౌరవ వీరు లారా! అవినయనదీకర్ణధారీ ! కర్ణుఁడా ! మీ రెల్లరు నా పరో క్షమున నేకాకి యగు నాపుత్త్రు నభిమన్యుఁ జంపితిరి. నేను మీ రెల్ల రిటు చూచుచుండఁగా వృషసేనుని రూపుమాపెద" నని సగర్వముగా నిర్ఘాంతఘోషభీషణ మగు గాండీవంబును సారిం చినఁ గర్ణుఁడును విల్లెక్కుడియెను.

దుర్యో : (భీతితో) తరువాతఁ దరువాత ?

సుంద : ఇంతలో భీమసేనుఁడు మరల యుద్ధమునకుఁ బూనఁగా గాండీవి యాతనిని వారించి యంగరాజు వృషసేనుల యుభయ

రథవార్ధికూలంకషముగ బాణనదీద్వయంబును బ్రవహింపఁ జేసెను. అంతఁ గర్ణవృషసేను లిరువురు నన్యోన్యస్నేహదర్శిత శిక్షావిశేషముతో నర్జును నెదుర్కొనిరి.

దుర్యో : అంత ! అంత !

సుంద : అంత దేవా ! గాండీవి తారరసిత జీవానిర్ఘోషమాత్ర విజ్ఞాతబాణవర్షమును గురియింపఁగా భూమ్యాకాశములు, రథస్వాములు, కుమారకేతుదండములు, సారథితురంగములు, సైన్యము, దెసలు, నీరలోకము నేమియుఁ గానరావయ్యెను.

దుర్యో ! (విస్మయముతో) తరువాతఁ దరువాత ?

సుంద : అంత దేవా ! క్షణమాత్రములో శరసంపాతము నతిక్రమించి పాండవసైన్యమున సింహనాదములు, కౌరవ సైన్యముల సవిషాదాక్రందనములు బయలువెడలి "వృషసేనకుమారుఁడు చచ్చె" నన్న మహాకోలాహలము వినిపించెను.

దుర్యో ! (భాష్పములతో రోషమున) అప్పై నాపై !

సుంద : దేవా ! వృషసేనకుమారుఁడు హతసారథితురంగమలూనాతపత్రచాపచామరకేతువంశములతో హృదయమర్మభేదకమగు శిలీముఖమున భిన్నదేహుం డయి రథమధ్యమునఁ బడి యుండుట చూచి వచ్చితిని.

దుర్యో : అయ్యో ! వృషసేనకుమారా ! ఇంకను విననేల ? హా ! వత్సా ! వృషసేన ! నేను జెప్పినపని చేయుచు నా తొడలపైఁ గూర్చుండెడివాఁడవు. ఓ గదాయుద్ధప్రియా ! వీర్యసాగరా ! రాధేయకులప్రరోహా ! ప్రియదర్శనా ! అయ్యో ! దుశ్శాసన నిర్విశేషా ! హా ! సర్వగురువత్సలా ! ప్రతివచన మిమ్ము.

ఉ. చేరెఁడుకన్ను, లభ్యుదయ
శీతమయూఖుని దివ్యకాంతి. పెం
పారెడు నూత్నయౌవనవ
యస్సముదంచితరమ్యశోభ. చే
కూరిన నీముఖాంబుజము
గోము దొరంగిన యంత్యవేళ నె
ట్లౌర! కనుంగొనం గలిగె
నయ్యయొ! త్వత్పిత కర్ణుఁ డత్తఱిన్. ౧౦

సూతు : ఆయుష్మంతుఁడా! విచారింపకుము. విచారింపకుము.

దుర్యో : సూతుఁడా! దుఃఖభాజనులు నిజముగాఁ బుణ్యాత్ములే. ఇఁక, మేమో!

గీ. ఎట్టయెదుటనె బంధువు లెల్ల రకట!
చనిరె యన్నపరాభవాగ్నిని మనంబు
పరితపించుచు నుండ సేపగిది మాకు
దుఃఖ మది కల్గు? వ్యథ యెట్లు తోఁచు నయ్యొ! ౧౧

(మూర్ఛిల్లును)

సూతు : మహారాజా! ఊరకొను మూరకొనుము. దుఃఖింపకు.

(పటాంతముచే విసరును)

దుర్యో : (లేచి) అపుడు నామిత్త్రుఁ డంగరా జేమి చేసెను?

సుంద : అప్పు డంగరాజు దేవా! యట్టిగతిఁ బడిపోయిన కొడుకుఁ జూచి యశ్రువులఁ దొప్పదోఁగి శరబాధను లక్ష్యపెట్టక యర్జునునిం దలపడెను. ఆరీతి సుతవధచే జనించిన మహాకోపముతో జీవితమును లక్ష్యపెట్టక విజృంభించిన కర్ణునిఁ జూచి భీమ నకుల సహదేవపాంచాల ప్రముఖు లర్జునునకు సాయపడిరి.

దుర్యో : తరువాత నేమైనది?

సుంద : అపు డర్జునచాపమహాప్రలయపయోధరములు వర్షించిన శరసహస్రవర్షముచే దిఙ్మండలము నిండుటఁగని శల్యుం డంగ రాజుతో "నోయీ! గుఱ్ఱములు చచ్చినవి, రథచక్రనేమికూ బరములు విఱిగిపోయినవి. ఇవుడు భీమార్జునుల నెదుర్కొనుట క్షేమము కాదు." అని చెప్పి రథము మరలించి తీసికొనిపోయి దింపి యాతనిని బహువిధముల నూఱడించెను.

దుర్యో : తరువాత?

సుంద : అపు డంగరాజు క్షణ మాఁగి పరిజను నింకొకరథముఁ గొని రమ్మని పంపి నన్ను దీనదృష్టిం జూచి "సుందరకా!" యని పిలిచిన నేను దగ్గఱ కేఁగితిని. అంత నాతఁడు తనముఖ పట్టికను దీసి దానిపై బాణాగ్రమును దనగాయముల నెత్తుట ముంచి దేవర కీసందేశమును వ్రాసి పంపెను.

(పత్త్రిక యిచ్చును)

దుర్యో : (గ్రహించి చదువును.)

"స్వస్తిశ్రీ దుర్యోధనమహారాజులకు. ఇంతవఱకు యుద్ధాంగణ మున నుండి ప్రభుకంఠమును గాఢముగాఁ గౌఁగిలించుకొని కర్ణుఁడు విజ్ఞాపించుచున్నాఁడు.

చ. శరబహువేది యీతనికిఁ
జాలినవాఁ డని లేఁడు, నాకు నూ
ర్గురు ప్రియసోదరావళికిఁ
గూరిమి నెక్కుడు, పాండుసూనులన్
దురమునఁ గూల్చు నీతఁ డని
తోషము నందెద; నేను భీము నె

ప్పురుషునఁ జంపఁజాల; వగఁ
బాయుము బల్మినో యశ్రుధారనో." ౧౨

ఇదియేమి! నూఱుగురు సోదరుల మరణమునకు విచారించు చున్నన న్నిట్టివాక్కు లనుశల్యముల బాధింతువేల? ఓయీ! సుందరకా! ఇపు డంగరా జేమి చేయఁ బూనినాఁడు?

సుంద : దేవా! శరీరాభరణముల విడిచి యాత్మవధకృతనిశ్చయుఁడై తిరగి పార్థునితో యుద్ధ మొనరింప సిద్ధముగ నున్నాఁడు.

దుర్యో : (విని వెంటనే లేచి) సుందరకా! నీవు తొందరగా నేఁగి వయస్యుఁడగు నంగరాజుతో నావచనములుగా నిటు తెలుపుము. "నీ విఁక విజయకాంక్ష విడిచిపెట్టుము. మన యిరువుర సంకల్పమునను భేదము లేదు. ఏలన,

ఉ. శత్రులఁ జంపి తర్పణము
చచ్చినబంధుల కిచ్చి యింక నే
మాత్రమొ చావకున్న మన
మంత్రుల మిత్రులఁ గూడి యేడ్చి యో
మిత్ర! మఱొక్కమాఱు విను
మీ తుదిసారిగఁ గౌఁగిలించుకొం
చాత్రముతోడఁ జత్త మక
టా! యదె దుఃఖమొ సౌఖ్యమో తుదిన్. ౧౩

ఇఁక, శోకవిషయమున నీ కేమి సందేశమిత్తును?

ఆ. బిడ్డ నీకు నాకు వృషసేనుఁ డనుకొమ్ము;
భ్రాత నీకు నాకుఁ బరము గన్న
దుస్ససేనుఁ డింక; దుఃఖాబ్ధిమగ్ను నిన్
నేను నన్ను నేల నీవు పలుక! ౧౪

సుంద : చిత్తము. దేవా! (నిష్క్రమించును)

దుర్యో : ఏమిది! నేమి ధ్వనియా?

సూతు : ఆయుష్మంతుఁడా! అది హేషారవసంవర్ధిత మగు నేమిధ్వని.

దుర్యో : ఓహో! పరిజనుఁడు కొనితెచ్చు రథ మిది. నీవు దానిని సిద్ధము చేయుము.

సూతు : చిత్తము. దేవా! (నిష్క్రమించి మరలఁ బ్రవేశించును)

దుర్యో : ఏమి? నీవు రథమెక్కి రాలేదేమి?

సూతు : దేవా! నీమాతాపితలు సంజయునితో రథమున నిటే వచ్చుచున్నారు.

దుర్యో : అయ్యో! మాతాపిత లిట నేల సంభవించిరి! దైవ మతిబీభత్సమే చేసెను. సూతుఁడా! నీ వేఁగి రథము సిద్ధపఱుపుము. నేనును దండ్రి కగపడకుండ దాఁగుదును.

సూతు : దేవా! వారికి నీ వొక్కఁడవే మిగిలినచుట్టమవు. వారి నేల యూఱడింపవు?

దుర్యో : సూతుఁడా! నిర్భాగ్యుఁడను నే నెట్లు వారి నూఱడింతును? చూడుము.

మ. రణరంగంబున కేఁగుదెంచుతఱిఁ దో
        రంబైన ప్రేమంబుతో
    ననుఁగుందమ్మని నన్ను నశ్రువుల మూ
        ర్ధాఘ్రాణముంజేసి పం
    పినవారిన్ దలిదండ్రి నేక్రియను నే
        వీక్షింతు నొక్కండఁ; ద

మ్మని చావున్ ముదివగ్గు లంధులకు నే
మోమెత్తి నేఁ జెప్పుదున్ ? ౧౫

సరే కానిమ్ము. ఏమైనను, గురువు లవశ్యవందనీయులుగదా !

(నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.

# పంచమాంకము

(రథయానమున గాంధారీ ధృతరాష్ట్రసంజయులు ప్రవేశింతురు.)

ధృత : వత్సా ! సంజయా ! కురుకులవనమున నిఁక మిగిలిన యేకైకప్రవాళ మగువత్స దుర్యోధనుఁ డెట నున్నాఁడు ? అతఁడు బ్రతికి యున్నాఁడా ? లేదా ?

గాంధా : జాతా ! వత్స నిజముగా జీవించియే యున్నచో నెట నున్నాఁడో చెప్పు.

సంజ : ఇదిగో ! ఇటనే మహారా జేకాకియై మఱ్ఱినీడను గూర్చుండి యున్నాఁడు.

గాంధా : జాతా ! ఏకాకియై యనుచున్నావు. భ్రాతృశతము సన్నిధిని లేదా ?

సంజ : తాతా ! అంబా ! రథము మెల్లగ దిగుఁడు.

ఉభ : (దిగుదురు)

సంజ : (దిగి సమీపించి) మహారాజా ! జయము. జయము. నిన్నుఁ జూడ నీతలిదండ్రు లిదే వచ్చియున్నారు. పలుకరింప వేమి ?

దుర్యో : (నిర్ఘాంతపోయి నిలఁబడును.)

ధృత :

చ. కవచము దీయఁ గంకపుము

ఖంబున నల్గుల నూడ్వఁగా శమం

బవునటు గాయపుందనువు

నందు వ్రణార్తిహరంపుఁ బట్టముల్

తవులుప, దిండుపై నొరగ
దవ్వన శత్రులు గెల్పుమై నగన్
జెవిని "సుఖంబ? వత్స!" యని
చీ! యడుగన్ వలసెన్ దురాత్ముఁడన్. ౧

(గాంధారీధృతరాష్ట్రులు తడవి దుర్యోధనుని కౌఁగిలించుకొందురు.)

గాంధా: వత్సా! పెద్దగాయములవలన బాధచే మాటవచ్చుట లేదా? నాయనా!

ధృత: వత్సా! దుర్యోధనా! నీ విట్లుండు టెన్నఁడెఱుఁగమే. మాతోఁ గూడఁ బలుకకున్నా వేమి?

గాంధా: వత్సా! నీవే మాటాడకపోయిన, నిఁక దుశ్శాసన దుర్మర్షణు లెట్లు మాటాడుదు రనుకొందును? (ఏడ్చును)

దుర్యో:

ఉ. సోదరు లందఱున్ మడియఁ
జూచి ప్రతిక్రియ చేయలేక దుః
ఖోదధి మిమ్ము ముంచిన మ
హోన్నతపాపిని భారతాన్వయ
చ్ఛేదకదుర్జనుండను ని
సీ! సుతనాశుఁడనైన నన్ను మీ
రీదయతో సుతుం డనుచు
నేల వచింతురు కూర్మిమీఱఁగన్? ౨

గాంధా: నాయనా! విచారింపకు. నీవైనను నంధుల మగు మాకు మార్గోపదేశకుఁడవై యుండుటకుఁ జిరంజీవివి కమ్ము. ఇంక రాజ్యమేల? జయమేల?

దుర్యో :

ఉ. ఇట్టి వికారవాక్యముల
నెన్నఁడుఁ బల్కఁ డెఱుంగ వీవు నేఁ
డిట్టులు పల్కఁ తేల ? జన
నీ ! ఘనరాజకులంబునందునం
బుట్టవొ ? నైచ్య మేల ? చని
పోయినపుత్త్రుల కేడ్వ కేల యీ
కట్టిఁడినైన నే బ్రతుకఁ
గావలె నందువు సిగ్గుచేటుగన్. 3

పుత్త్రశోకమువలన నీకుఁ గలిగిన వికారమే యిది. సందేహము లేదు.

సంజ : ఏమి : "చేఁద నూఁతఁబడిన బ్రాడును నందుఁ బాఱవే యరా" దనులోకోక్తి యసత్యమా ?

దుర్యో : ఇది సరి కాదు, ఉపక్రియమాణాభావమున నిఁక నుపకరణ మేల ? (దుఃఖించును)

ధృత : (దుర్యోధనునిఁ గౌఁగిలించుకొని) వత్సా ! విచారింపకుము. అతిదీనుల మైన మ మ్మూఱడింపుము.

దుర్యో : తండ్రీ : ఇపుడు మి మ్మూఱడింపలేను. ఏలన,

క. కుంతిని నే నిపుడే యొన
రింతున్ హతపుత్త్రి గాఁగఁ ! బ్రియసుతవధ కా
కుంతిని మీరలు మిమ్మున్
గుంతియు నూరార్చుకొనుచుఁ గుములఁగవచ్చున్. ౪

గాంధా : నాయనా ! నీ వొక్కఁడవైనను బ్రతికియున్నచో నా కదియే పదివేలు, నీవును బోయిన నిఁక నే నెవరికై యేడ్తును?

అందుచే నిది సమరమునకు సమయము కాదు, శాంతింపుము. నీకు దండము. యుద్ధవ్యాపారము మానుకొనుము. నామాట పెడచెవిని బెట్టకు.

ధృత : నాయనా! అశేషబంధువర్గము చనిపోవుటఁ జూచిన మా మాట నీవు తప్పక వినుము. ఏలన :

సీ. ఎవ్వారిభుజబలం బెంచి దాయాదుల
నిలఁ దృణంబులుగ నీ వెంచినావొ
యా ద్రోణభీష్ము లీయవనీతలంబున
లేరైరిగా తండ్రి !, వీరవరుని
కర్ణపుత్త్రుని లయకాలరుద్రునివంటి
వృషసేను నట్టులు పిలుకుమార్చి
వెలయునర్జునుఁ జూచి భీతిల్లు జగమెల్ల.
సుతులు నూర్గురు రణక్షితిని బడిరి
ఆ. మిగిలియుంటి వీవ పగఅప్రతిజ్ఞకుఁ
బోరు మాను వత్స ! వైరితోడ
గ్రుడ్డివార మేము గురులము నీకు మ
మ్మేలుకొనుము తండ్రి ! మేలు కలుగు.

దుర్యో : యుద్ధము మాని నేఁ జేయున దేమి ?

గాంధా : నాయానా ! నీపితయు విదురుఁడు నెట్లు చెప్పిన నట్లు చేయుము.

సంజ : రాజా ! ఇది యుచితము.

దుర్యో : సంజయా ! ఇంకను వారు నాకుఁ జెప్పఁ దగినది కలదా ?

సంజ : దేవా ! విజయాభిలాషి యగునృపుఁడు ప్రాణముపోవు

వఱకుఁ బ్రజ్ఞావంతులు చెప్పినది వినవలసినదే.

దుర్యో : (క్రోధముతో) ఐనచోఁ బ్రజ్ఞావంతు లగుమీరు మీ వచనము లేవో బాగుగాఁ జెప్పుఁడు.

ధృత : వత్సా ! యుక్తవాది యగుసంజయునిపైఁ గోపించుట తగదు. నీవు కోపము మాని విన్నచో నేనే చెప్పుదును వినుము.

దుర్యో : చెప్పుము.

ధృత : వత్సా ! అతివిస్తర మేల? యుధిష్ఠిరుఁడు కోరినపణ మిచ్చి వానితో సంధిచేసికొనుము.

దుర్యో : తండ్రీ ! తనయ స్నేహవైక్లబ్యమునఁ దల్లియు, బాలిశత్వమున సంజయుఁడు నట్లన్న నందురుగాని నీ వెటు లీమాట యనఁ గల్గితివి ! నీ కేమైనవెఱ్ఱియా ? లేక పుత్త్రనాశజనిత మగుహృదయజ్వరమా ? ఆ విధమునఁ దొలుత నస్ఖలితభ్రాతృశతముతో నవధీరితుఁడనై యుండ వాసుదేవుఁడు చెప్పిన సామోపదేశమును నిరాకరించి, యిపుడు పితామహాచార్యానుజరాజచక్రము గాంచిన విపత్తుఁ జూచి నీచశరీరమాత్ర స్నేహమున నుదాత్తపురుషవ్రీడావహము, నసుఖావహము నగుసంధి పాండవులతో నొనరింప దుర్యోధనుఁ డెట్లంగీకరింపఁగలఁడు? అదియుఁగాక నయకోవిదా ! సంజయా :

క. హీనుం డయి రిపుతోడ న
నూనం బగుసంధి చేయ నొప్పునె నృపుఁ డేన్
హీనుండును బాండవులో
సానుజు లెటు లగును సంధి యక్కట ! చెపుమా ! ౨

ధృత : వత్సా ! ఈస్థితియందైనను యుధిష్ఠిరుఁడు నాప్రార్థన మంగీకరించును. ఇది కాక యుధిష్ఠిరుఁ డెల్లప్పుడు విన్నుఁ

దనకన్న మిన్నగనే యాత్మలోఁ దలపోయుచుండును. నీతో నాతఁడు సంధి కిచ్చగించితీరును.

దుర్యో : ఎట్లు ?

ధృత : ఈ యుధిష్ఠిరుఁడు తనసోదరులలో నెవఁడు చనిపోయినను దాను బ్రాణము విడుతు నని శపథము చేసినాఁడు. ఆకారణమున నీ వొక్కఁడవైనను నాతని సోదరులలో నెవని కేమి కీడు వాటింతువో యను భయము నందుచుండును. కనుక నతఁడు సంధి కిచ్చగించును.

సంజ : నిజము.

గాంధా ! నాయనా ! వీరిమాట నిజము. నీ వట్లే వర్తింపుము.

దుర్యో : తండ్రీ ! అమ్మా ! సంజయా !

ఉ. తమ్ముఁ డొకండు చచ్చినను
దానును జావఁ బ్రతిజ్ఞఁ బూనెఁగా
యిమ్మహి ధర్మసూతి ! నగ
రే ! మఱి నూర్గురు తమ్ము లీల్గ దే
హమ్మున నుంత నేను ! నను
జాస్రముఁ గ్రోలిన భీమసేను నొ
క్కమ్మడి నుగ్గుసేయక గ
దోద్ధతి, సంధి యొనర్తునే యిఁకన్ ? ౭

గాంధా : నాయనా ! దుశ్శాసనా ! అయ్యో ! దుర్మర్షణా ! హా ! వికర్ణా ! లోకములో నిట్టి దురవస్థ యెప్పుడును విన్నదియుఁ గన్నదియుఁ గాదుగదా ! ఓ వీరప్రసవినీ ! గాంధారీ ! నీవు దుఃఖశతమునే కాని సుతశతమును గనలేదు !

(అందఱు నేడ్తురు)

సంజ : (కన్నీరు తుడుచుకొని) తండ్రీ! తల్లీ! మీ రిచటికి మహా రాజు నూఱడించుటకు వచ్చియున్నారు. మీరే యిట్లు స్తబ్ధులైన నిఁక నెట్లు ?

ధృత ! వత్సా! దుర్యోధనా! మనభాగ్య మిట్లున్నది. నీవు శత్రు ద్వేషము విడువఁజాలవు. త్వదేకశేషజీవితాలంబనుల మగు గాంధారీతపస్వినికి నాకు నిఁక శరణ మెవరు ? అవలంబన మేది !

దుర్యో : మీ కవలంబన మిదే వినుఁడు.

మ. అతివిస్తారధరిత్రి నేలఁ గని య
 పైశ్వర్యముల్ గాంచి యు
ద్ధతశత్రువ్రజనమ్రశీర్షమకుటో
 దాచార్చనల్ పొంది యు
న్నతవీరారిగణంబు నోర్చి యనిలో
 నన్ మృత్యువుం గన్న మీ
సుతులన్ మెచ్చి ధరిత్రిఁ గొండు సగర
 క్షోణీంద్రుచందంబునన్. ౮

ఇట్లు కానినాఁడు. నేను క్షత్త్రధర్మమును విడిచినవాఁడ నగుదుఁ గదా !

(తెరలో మహాకలకలము)

గాంధా : (విని మహాభయముతో) సంజయా! హాహాకారములతోడి యీతూర్యధ్వను లేమి ?

సంజ : అమ్మా! నానామహానినాదముల కాస్పద మైన యిచ్చోట నీవంటి భీరుజనము లుండరాదు.

ధృత : వత్సా! సంజయా! ఈహాహారవము లధికమగు చున్నవి. ఏదియో గొప్పకారణమే యుండనోపును.

దుర్యో : తండ్రీ! అనుగ్రహింపుము. దైవము మన కెదురై యున్నాఁడు. అందుచే మరల నేదైన నహితము చెవినిబడక పూర్వమే నాకు సంగ్రామమున కేఁగుట కనుమతి ననుగ్రహింపుము.

గాంధా : వత్సా! మందభాగిని నగున న్నొక్కమా ఱాలిడింపుము.

ధృత : వత్సా! నీవు సమరమునకుఁ గృతనిశ్చయుఁడవే యైనచో శత్రుజయమును రహస్యోపాయమున సాధింపుము.

దుర్యో : శా. ప్రత్యక్షంబుగ బంధుసంతతిని జం
పన్ బాండవుల్ చూచి య
ప్రత్యక్షంబుగ వారిఁ జంపుదునె? చం
పన్ మెత్తురే శత్రువుల్?

గాంధా : వత్సా! నీ వేకాకివిగదా! నీకు సహాయు లెవరు?

దుర్యో : సత్యం బే నొకరుండఁ జంపుదు రిపు
క్ష్మాపాలురన్ దైవమే
యత్యంతం బగుతోడు నాకు జగ మ
మ్మా! నేఁ డకౌంతేయ మౌ.

(తెరలోఁ గలకలము తరువాత)

ఓయోయోధులారా! ఈమహాయుద్ధము కౌరవేశ్వరునకు నివేదింపుఁడు. అప్రియశ్రవణపరాఙ్ముఖత యిఁకఁ జాలును, ఇపుడు కాలానురూప మగుప్రతిక్రియ నడుపవలయును. ఏలనఁ గురు శల్యుఁ డగుశల్యుఁడు

శా. త్యక్తప్రాజనరశ్మిరంకితతనుం
డై పార్థబాణంబులన్
రక్తం బుప్పతిలన్. రథాశ్వములు పా
రం దేరితో వెన్క కా
సక్తస్వాంతుల కంగరాజుగతి య
స్రంబే నివేదింపఁగా
రిక్తస్యందనుఁడై కటా : శిబిర మీ
రీతిన్ బ్రవేశించెడున్. ౧౦

దుర్యో : (విని శంకతో) సూతా ! అశనిపాతదారుణముగ నుద్ఘోషిత మైన యీపలు కెవరిదో ! ఎవఁడురా యక్కడ ?

సూతుఁడు : (ప్రవేశించి సంభ్రాంతుఁడై) అయ్యో! చచ్చితిఁ జచ్చితి.

(భూమిపైఁ బడిపోవును.)

దుర్యో : ఏమిది ?

ధృత. సంజ : ఏమిది ? చెప్పు. చెప్పు.

సూతు : ఆయుష్మంతుఁడా ! ఇఁక నేమున్నది ?

ఆ. కట ! మనోరథంబుగతి శూన్య మైన యా
కర్ణరథము నెక్కి కాంతి దక్కి
శల్యరూపమునను శల్యుండు శిబిరంబుఁ
జొచ్చి యెల్లజనులఁ బుచ్చె మూర్ఛ. ౧౧

దుర్యో : అయ్యో ! మిత్రమా ! కర్ణా ! (మూర్ఛిల్లును)

గాంధా : ఊఱకుండు మూఱకుండుము.

సంజ : మహారాజా ! ఊఱడు మూఱడుము.

ధృత : కష్టము ! కష్టము !

క. దురమున భీష్మద్రోణులు
మరణింపఁగఁ గురుబలంబు మహితాలంబం
బరయదు; కర్ణుఁడు నేఁ డిటు
మరణింపఁగఁ నింక దిక్కు మాకుం గలదే! ౧౨

వత్సా? ఊఱకొనుము. ఊఱకొనుము. ఓ హతవిధీ!

చ. సుతశతనాశనం బనెడి
శోచ్యదశం బొరలాడుచుంటి నం
ధతకును దోడు భార్యయు న
నంతవిచారమహాబ్ధి మున్గె నా
హితులును బంధువర్గములు
నెల్లరు నీల్గిరి నిర్విశేషులై
హతవిధి! యీసుయోధనుని
యందలి యాశయుఁ దోఁప దింతయున్. ౧౩

వత్సా! దుర్యోధనా! తపస్విని యైనమీయమ్మ నూఱడింపుము.

దుర్యో: (తెలివంది)

గీ. కర్ణ! కర్ణపేయతఁ బలుకమి నయంబె?
నాపయిఁ గలట్టిప్రేమ మంతయుఁ దొలంక;
విడిచియుండను జేయ నప్రియము నెపుడు
విడిచితివె నన్ను వృషసేను వెన్నుదగుల! ౧౪

(మరల మూర్ఛపోవును.)

అందఱు: (ఊఱడింతురు)

దుర్యో: (ఊఱడిల్లి)

క. ప్రాణము ప్రాణము కర్ణుఁడు
ప్రాణము వీడంగఁ జెవులఁబడినను చీ! నా

ప్రాణము వీడను సి గ్గిసి!
త్రాణ గలదె తండ్రి! నాకు ధైర్యముగొనఁగన్! ౧౫

మఱియు :

మ. అనుఁగుందమ్ముఁడు దుస్ససేనుఁ డనిలో
న ట్లీల్ల నుద్దండులౌ
మనబంధుల్ మృతినందఁగాఁ గనియు నే
మ్రాన్పాటునుం జెంది యే
డ్వ నిజం బెంతగ నేడ్వఁగా వలసినన్
బ్రాణంబుప్రాణంబు నా
యనుఁగున్నెచ్చెలి కర్ణుఁ డీల్గ నకటా!
యత్యంత మే నేడ్చెదన్. ౧౬

గాంధా : నాయనా! ఒకక్షణమైన నూఱకొను. తండ్రీ!

ధృత : వత్సా! ఒక్కమాఱు కన్నీరు తుడుచుకొనుము.

దుర్యో : క. నాకొఱకై బలియిచ్చె న
హా! కర్ణుఁడు ప్రాణవితతి ననివారితుఁడై
యేకరణిని నే నేడ్చెద
నాకర్ణునికొఱకు మీర లాఁపకుఁడు ననున్. ౧౭

అసంభావితముగ మత్కులాంతకర మగునీకర్మ మొనరించిన వ్యక్తి యెవఁడు?

సూతు : ఆయుష్మంతుఁడా! జను లి ట్లనుకొనుచున్నారు.

"క. భువిఁ గ్రుంకఁగ రథచక్రము
రవిసూనుం డెత్తులో నురంబును వ్రచ్చెన్
బవిగతి నర్జునబాణము
లవిరళకురుసైన్యకాలయమసన్నిభముల్." ౧౮

దుర్యో :

క. కర్ణాననేందు శోభా
వర్ణనమునఁ బొంగు శోకవార్నిధి కడు నా
యర్ణవము నింకిపోవును
గర్ణారిన్ దునుమఁ బుట్టుఘనబడబాగ్నిన్. ౧౯

తల్లీ ! తండ్రీ ! ఊఱడిల్లుఁడు.

క. శోకాగ్ని ప్రజ్వరిల్లుచు
నేకార్చుచు నుండె నాదునెద నే సైఁపన్
మీకేల శంక సమదుః
ఖాకులతను ? బోరి కేఁగ ననుమతి యిండీ ! ౨౦

ధృత : (దుర్యోధనుని గౌఁగిలించుకొని యేడ్చుచు)

ఉ. సాహసకార్య మన్న సుత !
సంశయచిత్తుఁడ నే నిజంబు నీ
వాహవదోహలంబునకు
నడ్డు సహింపవు భీమభీమస
న్నాహము నేఁ దలంచిన మ
నంబు ద్రవించు భయం బగున్ ఛల
వ్యూహ జయంబు నచ్చ దెటు
లో ? యిఁక మానధనా ! హతోస్మి. హా ! ౨౧

గాంధా : జాతా ! సుతశతకృతాంతుఁ డగు వృకోదరునితోడనే సమరము చేయ నేఁగుచున్నావా ?

దుర్యో : అంబా ! ఆవృకోదరు నటుండనిమ్ము !

చ. హృదయమనోరథంబు కడు
నింపులు గుల్కెడు సర్వదేహ స
న్మదమధురార్ద్రి చందన సు
ధారసచర్చ మదీయనేత్ర సం
పదకును గందు లేని శశి
మాత! భవత్సుతుఁ డోయితండ్రి! నీ
యెదకును గూర్చు కర్ణు నిపు
డిట్టులు చంపినవానిఁ జంపుదున్. ౨౨

సూతుఁడా! ఈకాలాతిపాతము చాలును. రథము సిద్ధపఱచి కొని తెమ్ము. పాండవు లన్న నీకును భయమే యగుచో నాఁగిపో. గదామాత్రసహాయుఁడనై నే నొక్కఁడనే సమర భూమి కేఁగుదును.

సూతు: నన్ను వేఱువిధముగాఁ దలంపకుము. నే నిదే వచ్చు చున్నాను. (నిష్క్రమించును)

ధృత: వత్సా! దుర్యోధనా! మమ్ము దగ్ధముచేయుటకే నిశ్చ యించుకొన్నచో నీ వెవరినో యొక వీరుని సేనాధిపతిగా నభి షేకింపుము.

దుర్యో: ఆతఁ డభిషిక్తుఁ డయియే యున్నాఁడు.

ధృత: శల్యుఁడా? అశ్వత్థామయా?

సంజ: రాజా!

క. గతియింపఁగ భీష్ముఁడు సం
హతి నందఁగ ద్రోణుఁ డంతమందఁగఁ గర్ణుం
డతిబలవతి యగుటాశయు
నతిరథుఁ డగుశల్యుఁ డొకఁడె యరులను గెలుచున్. ౨౩

దుర్యో : ఇఁక శల్యుం డేల ! అశ్వత్థామ యేల ?

ఆ. కర్ణమిత్త్రుఁ గూర్మిఁ గౌఁగిలింపంగనో
కర్ణశత్రుఁ జంపఁగాంచుటకునొ;
యద్దు లేక పాఱు నశ్రుజలంబుచేఁ
జేసికొంటిని నభిషేక మేనె. ౨౪

(తెరలోఁ గలకలము, తరువాత)

ఓకౌరవబలప్రధాన యోధులారా! మమ్ముఁ గాంచి భయపడి పాఱిపోకుఁడు. దుర్యోధనుఁ డెచట నెందుల కున్నాఁడో చెప్పుఁడు.

(అందఱు సంభ్రాంతులై విందురు.
సంభ్రాంతుఁడై సూతుఁడు ప్రవేశించును.)

సూతు : ఆయుష్మంతుఁడా !

గీ. ఒక్కరథ మెక్కి యిర్వురు నిక్కడక్క
డడుగుచున్నారు నీవార్త యరుగుదెంచి.

అందఱు : ఎవ రిరువురు ?

సూతు : కర్ణుఁ గూల్చినగాండీవి క్రౌర్యమూర్తి
క్రూరవృకకర్ముఁ డైన వృకోదరుండు. ౨౫

గాంధా : వత్సా ! ఇపుడు చేయు ప్రతిక్రియ యేమి !

దుర్యో : నాగద దగ్గఱనే యున్నదిగదా ?

గాంధా : అయ్యో ! దురదృష్టవంతురాలను, చచ్చితిని.

దుర్యో : తల్లీ! ఈకృపణత చాలును. సంజయా! రథ మెక్కించి పితరులను శిబిరముఁ జేర్పుము. నాశోకముఁ బోఁగొట్టఁ గల జనులే వచ్చినారు.

ధృత : వత్సా! ఒకక్షణము నిలువనిమ్ము. వారిభావ మేమో తెలిసికొందుము.

దుర్యో : తండ్రీ! ఇఁక నాలస్యము వలదు. పోయి రండు.

(గాంధారీ ధృతరాష్ట్రులు కొంతదూర మరిగి కూర్చుందురు.

రథాధిరూఢులై భీమార్జునులు ప్రవేశింతురు.)

భీమ : ఓసుయోధనానుజీవులారా! మీరు సంభ్రాంతులై యటు నిటు తిరిగెద రేల? మీ స్వామి యగు కురుపతికి మాయాగ మనముఁ గూర్చి చెప్పితిరా? మీ రేమియు భయపడకుఁడు.

సీ. మాయజూదంబున మమ్ము గెల్చినజోదు
లక్కయి ల్లాల్చిన యుక్కలీఁడు
ద్రౌపది సిగ ముట్టి తనియక వలువల
నెడలింపఁ గన్న యా వెడఁగుగాలి
పంచపాండవులను బరమదాసులనుగా
నమరించుకొన్న మహాభిమాని
దుశ్శాసనాదులదొర నూర్గురనుజుల
భ్రాత కర్ణుని మిత్త్రవరుఁడు నైన
గీ. కురుపతి సుయోధనుఁడు మహాచరితుఁ డెచటఁ
గొలువుదీరి యున్నాఁడొకో తెలుపుఁడయ్య!
క్రోధమున నాతనిని మేము కూల్ప రాము
చూచి పోవుటకే యిందుఁ జొచ్చినాము. 24

ధృత : సంజయా! ఈఖలుని యెత్తిపొడుపుమాటలు దారుణములు కదా!

సంజ : తండ్రీ! వా రిదివఱకే కృతనిశ్శేషకర్మ లయి ప్రియ

మొనరించుకొనినారు. ఇపు డీమాటలచే మరల నొనరించుకొను చున్నారు.

దుర్యో : సూతుఁడా! నే నిచట నీ యిరువురతోఁ గూర్చుంటి నని చెప్పుము.

సూత : చిత్తము. (పోయి) ఓ వృకోదరార్జునులారా! తలిదండ్రు లతో నీ మఱ్ఱిచెట్టునీడను మహారాజు కూర్చుండి యున్నాఁడు.

అర్జు : ఆర్యా! మన్నింపుము. పుత్త్రశోకపీడితు లగు పితరులను మన దర్శనముచే మఱింత యేడ్పించుట తగదు. పోవుదము.

భీమ : వెఱ్ఱివాఁడా! సదాచార మనుల్లంఘనీయముకదా! గురు వుల నభినందించికాని మఱి పోరాదు. (ప్రక్కకుఁ దిరిగి) సంజయా! పితరులకు మానమస్కృతు లని చెప్పుము. పోని మ్ము, ఉండుము. మేము వినిపింతుములే. (రథము దిగుదురు)

భీమ : అర్జునా! మన నామకర్మములతో గురువులకు వందనము చేయవలయునుజుమా!

(ఇరువురును సమీపింతురు.)

అర్జు : (దగ్గఱకుఁ బోయి) తల్లీ! తండ్రీ!

చ. అరిగణమున్ జయించు నని
యంతయు నింతనరానియాశ నూ
ర్గురు సుతు లెవ్వనిన్ దలఁచి
రో మఱి గర్వముచేత నెవ్వఁ డె
ల్లరిని దృణంబుగాఁ గని మె
లంగెనొ వానిని సూతపుత్త్రి ను
ర్వరఁ బడఁగొట్టి యున్నతఁడు
ఫల్గునుఁ డియ్యెడ వందనం బిడున్. ౨౩

భీమ : గీ. చూర్ణితాశేషకౌరవ్యశోభనుండు
పీతదుశ్శాసనాస్రసంప్రీతిహేతి
మఱి సుయోధనునూరుయుగ్మమును గొట్టు
భీమసేనుండు మ్రొక్కు నోపితరులార ! ౨౨

ధృత : (కోపముతో) దురాత్మా ! వృకోదరా ! శత్రువుల కపకృతి యొనరించినది నీవే కావురా. క్షత్త్రియకుల మంతయు సంగరమున విజయమో వీరమరణమో పొందుచునే యుండును. ఇఁక, నీ వాత్మస్తుతిచే మ మ్మేల యుద్వేగపెట్టెదవు ?

భీమ : తండ్రీ ! కోపపడకు. కోపపడకు !

చ. కురుసభ కట్లు ద్రౌపదిని
గొప్పువిదలుచ్చు నీడ్చితెచ్చి త
త్పరమపతివ్రతామణి క్రు
ధాగ్నిమహోజ్జ్వల కీలలందు మ్ర
గ్గిరి నృపబంధు లెల్ల రని
కేవల సత్యముఁ జెప్పినాఁడ నీ
వరయవె సాక్షివై కురుసు
తాగ్రగణు లెల్లరు చేయుదుష్క్రియల్ ? ౨౩

దుర్యో : ఏమిరా ! గాలికొడుకా ! ముసలిరాజుకడ నీచేసినచెట్టలను గొప్పపనులుగాఁ బొగడుకొనుచున్నావఁటరా !

చ. పసు లగుమీకు నేవురకు
భార్యయు నాకును ద్యూతదాసి యో
వసతిని నాదునాజ్ఞ నటు
లక్కడ నీడ్చినఁ జూచియున్నయీ

వసుమతిరాజులన్ బలుకఁ
బాడియె వైరమునందు గ్రమ్మఁగా ?
పస గలదేని నన్ను గెలు
వంగను రార ! పరాక్రమాన్వితున్. ౩౦

ఓరీ దురాత్మా ! నీవు చచ్చితివిరా ! (కోపముతో లేచి చంపఁబోవును.)

ధృత : (దుర్యోధనునిఁ బట్టుకొని కూర్చుండఁబెట్టును)

భీమ : (క్రోధము చూపును)

అర్జు : ఆర్యా ! దీని కింత కోప మేల ?

గీ. అప్రియంబును గ్రియను జేయంగ లేక
మాటచేఁ జేయుచున్నాఁడు మన కితండు
చచ్చిపోయినతమ్ములసంగతిని వి
షాదమునఁ బ్రేలు వీనితో వాద మేల ? ౩౧

భీమ : ఓరోరి భరతకులకలంకా !

గీ. ఓరి వాచాట ! నినుఁ జంపి యొక క్షణమున
దుస్ససేనునికడ కంపుదునుర ! యిపుడు
మద్గదాశక్తినిర్భిద్యమానయుష్మ
దస్థిశబ్దంబునన్ బిత లడలకున్న. ౩౨

మఱియు నోమూర్ఖా !

మ. వనితం బోలి విరోధ మేడ్చునని తీ
ర్పం గాంచుచున్నావు నీ
యనుజన్ముం డగు దుస్ససేనునెద నే
నానాఁ డటుల్ వ్రచ్చి నె

త్రును గ్రోలంగను జూచుచున్ నిలువవే?
దుఃక్షత్త్రియా! నీవు: పెం
పున యుష్మత్కులపద్మినీగజము భీ
ముం డల్గినన్ జావవే? ౩౩

దుర్యో: దురాత్మా! భరతకులాధమా! ద్యూతదాసా! పాండవ పశువా! నీవలె నేను డంబములు కొట్టనురా!

గీ. మద్గదాభిన్నవక్షస్థ్సలోద్గత మగు
నెత్రుటేరున నెమ్మికల్ నీవి మెఱయ
సమరతలమున నీచావుజాడఁ దెలిసి
యిపుడె పాండవు లెంతయో యేడ్వఁగలరు. ౩౪

భీమ: (నవ్వి) ఓహో! ఐన మేము ని న్నేమఱరాదు. మఱి యిదిగో! నాప్రతిజ్ఞ వినుము.

చ. గిర గిరఁ ద్రిప్పుకొంచు గద
కిన్కను నీదగునూరుయుగ్మ ము
ద్ధురముగఁ బిండిగొట్టి తల
దూర్తుఁ బదంబులు ద్రొొద్దుటన్ నృపుల్
వెఱపునఁ జూడ; నెల్ల రరి
వీరులఁ జెండి తదస్రచందనం
బరు దగునందమంద నొడ
లంతయుఁ జిమ్ముకొనం జెలంగుదున్. ౩౫

(తెరలో)

ఓ భీమసేనార్జునులారా! ఇదిగో! నిహతాశేషారాతిచక్రుండును, ఆక్రాంత పరశురామాభిరామ యశుండును. ప్రతాపతాపిత దిఙ్మండల స్థాపితస్వజనుఁడును, అజాతశత్రుఁడును, మహా

రాజును నగు శ్రీయుధిష్ఠిరచక్రవర్తి యిట్లాజ్ఞాపించు
చున్నాఁడు.

భీమ. అర్జు : ఏమని ?

(మరలఁ దెరలో)

చ. అనిఁ దెగియున్న యాప్తులకు
నగ్నికృతుల్ తగఁ జేయుఁడయ్య!; భ
క్తిని నయనాశ్రువారిని గ
తించినబంధుల కిందు తర్పణం
బును దగుబాంధవుల్ సమర
భూమిని నేఁడు జ్ఞాతిదేహముల్
చనె నినుతోడ శత్రువుల
సంతతి సైన్యములన్ మరల్పుఁడీ! ౩౬

భీమ. అర్జు : సరే. (నిష్క్రమింతురు)

(తెరలో)

ఓరోరి గాండీవాకర్షణ బాహుశాలీ! అర్జునా! ఎటకుఁ బోవుదురా!

మ. నినుఁ జంపం గలవిల్లు కర్ణుపగచే
నే వీడుటం జేసియే
వనమందున్ వలె వీరశూన్యరణసే
వన్ బ్రౌఢుఁ డైనాఁడవా ?
జనుకుం డస్త్రము వీడినప్పటి శిర
స్స్పర్శంబు భావించి నే
ననికిం జొచ్చితిఁ బాండవద్రుపదసై
న్యాగ్నిక్రియన్ ద్రౌణినిన్. ౩౭

ధృత : (విని సంతోషముతో) వత్సా ! దుర్యోధనా ! ద్రోణవధ పరిభవోద్దీపక క్రోధపావకుఁడును, తండ్రికంటెను సమధిక బలుఁడును, శిక్షావంతుఁడు, దేవసదృశుఁడు నగు మహాత్ముఁ డశ్వత్థామ విచ్చేయుచున్నాఁడు. ఆ మహావీరుని నీ వెదురేఁగి సంభావింపుము.

గాంధా : నాయనా ! ఆ మహానుభావున కెదురేఁగుము.

దుర్యో : తండ్రీ ! తల్లీ ! అంగరాజుచావుఁ గోరిన యీవ్యర్థ యౌవనశస్త్రగ్రహణుఁడు మన కేల ?

ధృత : వత్సా : ఈ తరుణమున నంతపరాక్రమవంతునితో నిట్టి మాట లాడి యాతనికి విరాగము కలిగింపరాదు.

అశ్వత్థామ : (ప్రవేశించి) కౌరవాధిపతీ ! జయము. జయము.

దుర్యో : (లేచి) గురుపుత్త్రా ! ఇటుఁ గూర్చుండుము.

(కూర్చుండఁ బెట్టును.)

అశ్వ : రాజా ! దుర్యోధనా !

గీ. చెవుల కింపుగఁ బల్కియు నవల కర్ణుఁ
డనిని జూపినపస తెల్లమయ్యె నీకు;
ద్రౌణి విల్లెక్కిడి రణంబుఁ దా నొనర్ప
వచ్చెఁ బ్రతికృతి చింతఁ బోఁబుచ్చు మదిని. ౩౮

దుర్యో : (మిక్కిలి యసూయతో) ఆచార్యాత్మజా !

గీ. కర్ణుఁ డీల్గినపిదపనే కాదె నీవు
యుద్ధ మొనరింపఁ బూనిక నుండినాఁడ
వేను మరణించుదాఁక నీ వెదురుచూడు
కర్ణదుర్యోధను లన నొక్కటియె కాదె ? ౩౯

అశ్వ : (తనలో) ఏమి! ఇపుడుకూడఁ గర్ణుఁ డన్నఁ బక్షపాత మును నే నన్నఁ బరిహాసమునా? (ప్రకాశముగా) రాజా! కౌర వేశ్వరా! అట్లే యగుఁగాక! (నిష్క్రమించును)

ధృత : వత్సా! నీకు మతి లేదా యేమి? ఇట్టి సమయమునను నట్టి మహానుభావుఁ డైన యశ్వత్థామకుఁ బరుషవాక్యములచే మనస్సు విఱుగునట్లు చేసితివి!

దుర్యో : ఏమి? నే నేమి యసత్య మాడితిని? ఇది నాకుఁ గ్రోధహేతువు కాదా! ఏలన:

గీ. ధన్యు లగురాజులకుఁ జూడఁ దలఁపరాని
వీరువరుఁ గర్ణు దురదృష్ట కారణమున
ననిని జచ్చినవాని నాయాప్త మిత్రుఁ
దిట్టుద్రౌణికిరీటులు నెట్టు వేఱు? ౪౦

ధృత : అయ్యో! వత్సా! ని న్ననవలసిన దే మున్నది? భరత కులమున కిది యవసానదశ. గాంధారీ! సంజయా! నిర్భాగ్యుఁ డను నే నేమి చేయుదును? (ఆలోచించి) ఇట్లగుఁగాక! సంజయా! నీ వేఁగి అశ్వత్థామతో నావచనములుగా నిట్లు పలుకుము:

చ. ఇరువురుఁ గూడియాడుచును
నింపుగ స్తన్యముఁ గ్రోలియుండు చే
మఱకుము: నిన్ను నెత్తుకొని
మాయ దుకూలము ముద్దులాడుటల్
మఱవకు; భ్రాతృదుఃఖమున
మైత్రిని ని న్నటు లాసుయోధనుం
డఱవఁగఁ గ్రోధముం బెనుప
కయ్య! గురూత్తమ పుత్త్రి! వీనిపై. ౪౧

సంజ : సరే. (లేచును)

ధృత : ఇదికూడ నా పలుకుగా నతనికిఁ జెప్పుము.

చ. అనృతము విన్న నీపిత మ
హాత్ముఁ డటుల్ శర ముజ్జగించుటన్
గన విన రాని రీతి నతి
గాఢపరాభవ మాతఁ డందుటన్
ఘనబలమున్ బరాక్రమముఁ
గాంచిన వీరసుతుండ వుండుటన్
గొనకొని తీర్తుగాని పగ
కోపము నొందుకుమయ్యా! పుత్త్రుపై. ౪౨

సంజ : అట్లే. (నిష్క్రమించును)

దుర్యో : సూతుఁడా! యుద్ధమున కనుకూల మగు రథమును నాకు సిద్ధ మొనరింపుము.

సూతు : చిత్తము. దేవా! (నిష్క్రమించును)

ధృత : గాంధారీ! మనము మద్రపతి శల్యుని శిబిరమున కేఁగుదము. వత్సా! నీ వట్లొనర్పుము. (అందఱు నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.

# షష్ఠాంకము

(ఆసనమునఁ గూర్చుండి యుధిష్ఠిరుఁడును—ద్రౌపది, చేటి, బుధకుఁడును ప్రవేశింతురు.)

యుధి : (చింతించుచు నిట్టూర్పు విడిచి

ఉ. ఈఁదితి భీష్మసాగరము
    నెట్టులొ యార్చితి ద్రోణవహ్ని నే
మోఁదితిఁ గర్ణసర్పము న
    పూర్వవిధంబున శల్యప్రాణముల్
జేఁదితి నీ గతిన్ లఘు స
    శేషజయంబును గాంచి యుంటి నీ
మీఁదను భీమసాహసము
    మిక్కిలి జీవితశంకఁ గొల్పెడిన్ ! ౧

ద్రౌప : (కన్నీటితో) మహారాజా! జీవితశంకఁ గొల్పినది పాంచాలి బ్రతుకు కాని భీమసాహసము కాదు.

యుధి : రెండును గావు. నేనే జీవితశంకఁ గొల్పితిని. (బుధకునితో) బుధకా !

బుధ : దేవా ! ఏమి యాజ్ఞ ?

యుధి : బుధకా ! సహదేవునితో నిట్లు చెప్పుము. "క్రుద్ధుఁడై వృకోదరుఁడు సాయంతనములోఁగాఁ దాను సుయోధనునిఁ జంపలేకపోయినచోఁ దానే చత్తు నని చేసిన దారుణప్రతిజ్ఞను విని మానధనుఁడయ్యుఁ గౌరవరాజు మాయమయ్యెను. అందుచే. దుర్యోధను నన్వేషించుటకు నిపుణులు, యథార్థాభిజ్ఞులు.

భక్తిమంతులు నగు సచివులు పటుపటహరవవ్యక్తఘోషమున దుర్యోధనుని జాడఁ దెలిపినవారికి బహుధనాదిబహూకృతు లిత్తు మని చాటుచు శమంతపంచకమునఁ దిరుగవలయును. మఱియు,

ఉ. పంకములందు సైకతపుఁ
బట్టుల జాలరు లారయన్ వలెన్
బొంకపుడొంకలన్ వెదకఁ
బోవవలెన్ బెదగొల్ల లెల్ల రే
వంకను వ్యాఘ్రచారివన
పంక్తిఁ గిరాతులు చూడఁగా వలెన్
గొంకక రంధ్రవిజ్ఞు లతి
గూఢతఁ బోవలె నాశ్రమంబులన్. ౨

బుధ : చిత్తము. దేవా !

యుధి : ఉండు. సహదేవున కిదియుఁ దెల్పుము.

చ. అలుకుచు నెవ్వరెవ్వ రెటు
లాడినఁగాని రహస్యవృత్తముల్
చులకనఁ జూడరాదు. మఱి
సుప్తుల రోగుల నార్తులన్ వన
స్థలముల నేమఱం జనదు
జంతులత్రాసము పక్షికూఁతలున్
గలిగినచోట్ల శ్రద్ధఁ గనఁ
గావలయున్ నృపపాదచిహ్నముల్. ౩

బుధ : చిత్తము దేవా ! (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) దేవా ! పాంచాలకుఁ డేతెంచియున్నాఁడు.

యుధి : త్వరగా రానిమ్ము.

బుధ : (నిష్క్రమించి, పాంచాలకునితో మరలఁ బ్రవేశించి) ఇదిగో ! దేవా ! పాంచాలకుఁడు సమీపించుచున్నాఁడు.

పాంచా : దేవా! జయము. జయము. దేవికిని దేవరకును బ్రియ వార్తఁ దెలుప వచ్చితిని.

యుధి : పాంచాలకా ! దురాత్ముఁ డగు కౌరవాధమునిజాడ తెలిసినదా ?

పాంచా : జాడ తెలియుటే కాదు. దేవీకేశపాశ స్పర్శపాతక ప్రధాన హేతుభూతుఁడే దొరకినాఁడు.

యుధి : (ఆనందముతోఁ గౌఁగిలించుకొని) మంచిది. భద్రా ! మంచి మాట చెప్పితివి. ఏమి ? కంటి కగపడినాఁడా ?

పాంచా : దేవా ! సమరగోచరుఁడు కాలేదా యని యడుగుము.

ద్రౌప : (భయముతో) నానాథుఁడు వానితో సమరమున నున్నాఁడా :

యుధి : (అశంకతో) వత్స వానితో సమరమున నున్నాఁడా ?

పాంచా : నిజము. మహారాజా ! నే నసత్య మాడుదునా ?

యుధి : మ. గద చేతం గొనుభీమువిక్రమము లో
కంబందు నేఁ గాంచియున్
మదిలో సంశయ మందుచుంటి నకటా !
మా కౌనా కాదో జయం
బది యంచున్; దలపోయఁ గారణ మనూ
హ్యం బౌ; 'నతిస్నేహ మా
స్పద మౌఁ బాపకుశంక' కన్న నుడియే
సత్యంబు నా పట్టునన్, ౪

(ద్రౌపదిని జూచి యామె కన్నీరు తుడిచి) ఓసీ ! సుక్షత్రియురాలా !

మ. కురువృద్ధుల్ కురువృద్ధబాంధవు లనే
కుల్ రాజులుం జూడ నీ
వరకేశగ్రహణాది యౌ పరిభవ
ప్రజ్యోతి చల్లారు నం
దఱముం జచ్చిననొండె లేనియెడలన్
బాపాత్మకుం డైన యీ
కురురాట్ క్రూరమృగంబు నేఁడె యనిలోఁ
గోల్పోయినన్ బ్రాణముల్. ౫

ఐనను, సందేహ మవసరము లేదు.

గీ. ప్రతిన చెడు నన్న భీతిచేఁ ద్వరితుఁడైన
భీమసేనునిచేఁ జచ్చు వినుము నేఁడె
పావనం బగునీకేశపాశవితతి
హస్తమునఁ బట్టి యీడ్పించినట్టితులువ. ౬

పాంచాలకా ! చెప్పు. చెప్పు. ఆదురాత్ముఁ డెటు లెక్కడ దౌర కెను ? ఇప్పు డేమి జరుగుచున్నది ?

ద్రౌప : భద్రా ! చెప్పు. చెప్పు.

పాంచా : దేవా ! దేవీ ! వినుఁడు. నీచే మద్రపతి శల్యుఁ డీల్గుటయు, గాంధారరాజశలభకులము సహదేవశస్త్రానలమునఁ బ్రవేశించుటయు, సేనాపతిమరణమున భీతులై మిగిలినయోధులు రణభూమిని విడిచి పాఱుటయు, మనసేనలు శత్రుపరాజయమును గాంచి యుప్పొంగుచు ధృష్టద్యుమ్నాధిష్ఠితము లయి యుండుటయు, కృపకృతవర్మాశ్వత్థామలు ప్రణష్టు లగుటయుఁ గని వృకోదరప్రతిజ్ఞాభీతుఁడయి దురాత్ముఁ డగుకౌరవాధముఁ

డెటనో దాఁగుకొనెను.

యుధి : తరువాతఁ దరువాత ?

ద్రౌప : తరువాత ?

పాంచా : తరువాత భగవంతుఁ డగువాసుదేవునిచే నధిష్ఠింపఁ బడిన రథ మెక్కి భీమార్జునకుమారులు శమంతపంచకము నంతను వెదకిరి. కాని, జాడ తెలియదాయెను. అపు డస్మాదృశు లగుభృత్యవర్గమువారు దైవమును దలఁచి దుఃఖించిరి. అర్జున కుమారుఁడు దీర్ఘనిశ్వాసమును విడిచెను. వృకోదరుఁడు జలధర సమయనిశాసంచారిత తటిత్ప్రకార పింగళదృష్టులను గదాదండ ముపైఁ బ్రసరింపఁజేసెను. కృష్ణభగవానుఁడు విధికృతుల నిందిం చెను. అపు డొకపురుషుఁడు చేత మాంసము నిడికొని క్రొత్తఁ జంపిన మృగలోహితచరణములతోడను, గట్టుఁబుట్టముతోడను, బరుగున భీమసేనునికడ కేతెంచి గట్టి నిట్టూర్పులసందడిని విని వినిపింపనిమాటలలో నిట్లనెను : "దేవా ! భీమసేనకుమారా : ఇటకు సమీపమునఁ గలయొకహ్రదమునందలి మడుఁగులో దిగినరెండడుగులజాడలు కానవచ్చినవి. ఒకటి లోనుండి వచ్చి నది. రెండవది యట్లు కానిది. తరువాత మీచిత్తము" అంత మే మెల్లరము సంభ్రమచిత్తులమై యాతనివెనుక నట కేఁగి సుయోధనునిపద చిహ్నలుగా వాని నెఱింగితిమి. అపుడు వాసు దేవుఁ డిట్లనెను. "ఓ వీరవృకోదరా! సుయోధనునకు జల స్తంభ విద్య తెలియునుగదా! ఆతఁడు నీకు భయపడి యీహ్రదము లో దాఁగునొనియుండును." బలరామానుజుని యీమాట విని భీమసేనుఁడు దిగ్గజము లడలిపోవునట్లు, సలిలచారిసకలజంతు వులు బెదరిపోవునట్లు, మడుఁగంతయుఁ గలఁగఁబాఱునట్లు

భైరవ మగుసింహనాదముఁ జేసి "యోరోరివృథాప్రఖ్యాపితాలీక పౌరుషాభిమానీ! పాంచాలీకేశాంబరాకర్షణ మహాపాపీ! ధార్తరాష్ట్రాపశదా!

చ. మలినత లేని యిందుకుల
మాన్యతఁ బుట్టితి విప్పుడున్ గదా
కలితకరుండ వీవు నను(
గాఱులు గూసితి దుస్ససేనుర
క్తలలితపాయినిన్ గరము
కట్టఁగఁ జూచితి కృష్ణదేవునిన్
జలమునఁ బంకమందు దిగి
చత్తువె సిగ్గఱి రాజకీటమా! ౭

మఱియు మానవంతుఁడ వగు నో కౌరవాధమా!

ఉ. భర్తలు చచ్చి కౌరవుల
పత్నులు కొప్పులు చేతఁబట్టి పె
ల్లార్తిని గొంతు లేదుటను
నాఱెను ద్రౌపదిక్రోధవహ్నిత
ద్భర్తకతాన నీదుపెద
తమ్ముని రక్తము ద్రాగి ముందటన్
నర్తనచేయు నన్విడిచి
నాఁడవె? శౌర్యము వీడఁ బాడియే? ౮

ద్రౌప: నాథా! నీపునర్దర్శనము నాకుఁ గలిగినచో నాకోపము తీరినట్లే.

యుధి: కృష్ణా! ఈసమయమున నమంగళముఁ బలుకకుము. భద్రా! తరువాత నేమయ్యేను?

పాంచా : దేవా ! ఇట్లు పలుకుచు భీమసేనుఁడు లోని కుటికి క్రోధోద్ధతభ్రమితభీషణ గదాపరిఘపాణియై గట్టుతెగిన దానిని గను, నష్టమైననళినవనము గలదిగను, జాపకట్టువడ్డ మొసళ్ళు కలదిగను, భయపడ్డసమస్తజలజంతువులు గలదిగను నాహ్రద మును వేగముగా సుడిగుండములు తిరుగునట్లు కలఁచివేసెను.

యుధి : భద్రా ! అప్పుడు నాతఁడు బయలుపడలేదా !

పాంచా : దేవా ! వెలువడ కేమగును ?

గీ. భీమభుజమందరంబున వెల్లి చిలుక
పాలసంద్రంబునం బుట్టు కాలకూట
విషముగతిఁ గోపఘూర్ణితవేషి యగుచు
వెలువడె సుయోధనుం డొక్క వలననుండి.

యుధి : మంచిపని చేసితివి. సుక్షత్రియా! మంచిపని చేసితివి.

ద్రౌప : సమరప్రతిపన్నుఁ డైనాఁడా ? లేదా ?

పాంచా : అట్లు పైకి వచ్చి కరద్వయమున గదాద్వయమును ద్రిప్పుకొనుచు నాతఁ డిట్లనియె. "ఓరోరి గాలికొడుకా ! భీతిచే నేను డాఁగితి ననుకొనుచున్నావా ? పాండవుల నెల్లర భండన మునఁ జంపకుండఁ బరులకంటఁ బడ నిచ్చగింపక బడలిక దీర్చుకొనుటకై పాతాళమున విశ్రమించితినిరా." ఇంతలో వాసు దేవకిరీటులు నీటిలో యుద్ధము పనికిరా దని యిరువురను బైకిఁ దీసికొనివచ్చిరి. కౌరవపతి భూమిపైఁ గూర్చుండి గదను గ్రిందఁబెట్టి విఱిగిపోయిన వేయియరదములు, చచ్చిపోయిన కౌరవకులసహస్రము, ముక్క ముక్కలై పడియున్న గజవాజి సహస్రకళేబరములపై నున్నగృధ్రకంకజంబుకములచే భీతావ హమై మిక్కిలి నష్టపడిన తనబలము, మనవీరులుచేయు

సింహనాదములతో సంవలిత సమరతూర్యము, అమిత్రబాంధవము, నకౌరవము, సమిత్రబాంధవము సపాండవము నగు పొలికలనుఁ జూచి యాతఁడు వేఁడినిట్టూర్పులు నిగుడ్చుచుండెను. అప్పుడు వృకోదరుఁడు "ఓయీ! కౌరవరాజా! బంధుజనచింత విడువుము. పాండవులు సమరసమర్థులు, నీ వసమర్థుఁడవు నని విచారింపకుము.

గీ. పంచపాండవులందు నీ వెంచుకొనుము
యోధు నొక్కని సమరసుయోధనమున
వలయు శస్త్రాదికమ్ముఁ గవచముఁ బూని
జరపుసమరోత్సవమ్ము స్వచ్ఛందగతిని." ౧౦

అనెను. ఈమాటలు విని కొంచె మసూయ గలచూపులతో భీమార్జునులం జూచి దుర్యోధనుఁ డిట్లనెను.

గీ. కర్ణదుశ్శాసనుల జంపుకారణమున
నుభయులును మీరు నాకుఁ దుల్యులు తలంప
నప్రియుఁడ వైనఁ బ్రియయోధుఁ డౌదు వీవు
చాలఁ గోరుదు నిన్ బ్రియసాహసాంక! ౧౧

అని లేవ నా రొండొరులు పరుషవాక్య ఘోరసంగ్రాములైరి. అంత వారిరువురు చిత్రగదాపరిఘభాసురభుజపంజరులై మండల ప్రచారముల విహరింపఁదొడఁగిరి. అపుడు భగవంతుఁ డగు చక్రపాణి నన్నిటకుఁ బుత్తెంచుచు మీతో నిట్లు పలుకు మనెను. "భీమసేనుఁ డింకను దీఱనిప్రతిజ్ఞ కలవాఁడును దుర్యోధనుఁ డంతర్హితుఁడును నగుట మాకు విషాద హేతువైనది. కాని, యిపుడు దుర్యోధనుఁడు భీమసేనునిచేఁ జిక్కినాఁడు. ఇఁక, నిష్కంటకముగా నీభూమిని బాలింపుము. అభ్యుదయమునకుఁ

దగినమంగళక్రియ లెల్ల ప్రారంభింపుము. సందేహ మేమియు వలదు,

మ. రతనంపుంగలశంబులన్ జలముఁ ద్వ
    ద్రాజ్యాభిషేకార్థమున్
  సతివేణీహరణోత్సవంబునకునై
    సర్వక్రియల్ కూర్పు ము
  న్నతరాజద్రుమఖండనప్రవణతీ
    క్ష్ణప్రాక్కుఠారుండు వా
  యుతనూజుండును గ్రుద్ధు లైన విజయం
    బొందంగ సందేహమే? ౧౨

ద్రౌప : (ఆనందబాష్పములతో) త్రిభువననాథుఁడే యిట్లాజ్ఞాపించుచుండ నిఁక వేఱొకవిధముగ సంభవించునా?

పాంచా : ఇది కేవల మాతనియాశీస్సే కాదు. ఆదేశమే.

యుధి : భగవత్సందేశమునకు వికల్ప మెట్లును గలుగదు. ఎవఁడురా? అక్కడ?

కంచుకి : (ప్రవేశించి) దేవా! ఆజ్ఞాపింపుము.

యుధి : దేవదేవుఁ డగుదేవకీనందనుని దివ్యప్రసాదమున భీమసేనకుమారుని విజయమంగళోత్సవమునకై సర్వోచితసంభారములు సమకూర్పవలయును.

కంచు : చిత్తము. (ఉత్సాహముగా నడచి) ఉచితజ్ఞులతోఁ గూడియున్న యో యంతఃపురప్రధానద్వారపాలకులారా? కౌరవాపమానసాగరమును భుజబల మనునావచే దాఁటినవాఁడును, నిజప్రతిజ్ఞాపారమును జక్కఁగాఁ గాంచినవాఁడును, సుయోధనానుజశత మనుతృణకణములకు మహావాయువును, వాయుపుత్త్రుఁ

డును, దుశ్శాసనునివక్షస్స్థలమును జీల్చివై చిననరసింహుఁడును, దుర్యోధనుని యూరుస్తంభములను విఱుగఁగొట్టఁ గలవిజయ బలశాలి యైనభీమసేనునిపై నిండువాత్సల్యము గలయుధిష్ఠి రుఁడు మంగళకృత్యములు నిర్వర్తింప నాజ్ఞాపించుచున్నాఁడు. (ఆకాశముపైకిఁ జూచి) ఏమనుచున్నారు ? అన్నియు నధికతర ముగా నిర్వర్తించితిమి, నీవు చూచుట లేదా యనియా ! మం చిది. ఉత్తములారా! మంచిది. చెప్పకుండఁగనే మేలుచేయుట మనోగతస్వామిభక్తిని మిక్కుటముగా వెల్లడించునుగదా !

యుధి : ఆర్యా ! జయంధరా !

కంచు : దేవా ! ఏమియాజ్ఞ ?

యుధి : నీ వరిగి యీశుభవార్తఁ దెచ్చినపాంచాలకునికి బహు మతి నొసంగి సంతోషపెట్టుము.

కంచు : చిత్తము. (పాంచాలకునితో నిష్క్రమించును)

ద్రౌప : మహారాజా ! భీమసేనుఁడు దుర్యోధనుని మీ యైదు గురిలో నొకరిని గోరుకొను మని యేల యనెను ? ఒకవేళ నాతఁడు నకులసహదేవులలో నొకనిఁ గోరుకొని సమరము చేయుదు నని యన్న మనకుపద్రవము కలుగదా !

యుధి : కృష్ణా ! దానికిఁ గారణ మిది : బంధువు లెల్లరును, సోదరు లందఱును జచ్చి యేకాదశాక్షౌహిణీసేనలో నిఁకఁ గృప కృతవర్మాశ్వత్థామలే మిగిలియుండుటచే దుర్యోధనుఁడు బంధు రహితుఁడు దేహముమాత్రమే మిగిలినవాఁడై యున్నాఁడు. అతఁ డభిమానమును విడిచి యాయుధత్యాగము చేసినఁగాని తపోవనమున కేఁగినఁగాని, తండ్రియెదుట సంధిచేసినఁగాని, సకలరిపులను జయింతు నన్నభీముని ప్రతిజ్ఞ యింతవఱకు వచ్చి

వ్యర్థమగు నని తలఁచి, దుర్యోధనునకు సమరోత్సాహముఁ గల్పింప నట్లు పలికెను. మఱియు దుర్యోధనుఁడు పాండవులలో నెవ్వనిని జయింపలేఁడు. వృకోదరునితోడనే గదాయుద్ధ మాతఁడు కోరు నని నే ననుకొనుచున్నాను.

ఉ. కోపమునన్ రణంబునను
ఘూర్ణగదాధరుఁ డైనభీముపెం
పోపఁగఁజాల రెవ్వరు సు
యోధనుఁడున్ బలరాము సాటి యీ
పాపపుధార్తరాష్ట్రులను
పద్మినికిన్ గజ మైనభీముఁడే
యోపు జయింపఁ గోరును సు
యోధనుఁ డాతనిఁ గోరఁ డన్యులన్. ౧౩

(తెరలో)

దాహము! దాహము. అయ్యో! దాహము. దాహము. కొంచెము నీరు నీడ యచ్చి నన్నుఁ గాపాడుఁడు.

యుధి: (విని) ఓరీ! ఎవఁ డక్కడ?

కంచు: (ప్రవేశించి) దేవా! ఏమియాజ్ఞ?

యుధి: అదేమియో తెలిసికొనిరా.

కంచు: చిత్తము. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) దేవా! దప్పికగొన్న యొకయతిథి.

యుధి: వెంటనే ప్రవేశపెట్టుము.

కంచు: చిత్తము. (నిష్క్రమించును)

(చార్వాకుఁ డనురాక్షసుఁడు మునివేషధారియై ప్రవేశించును)

చార్వా: (తనలో) నేను సుయోధనునిపరమమిత్రుఁడ నైనందుల

కేరీతినో పాండవులను వంచింపవలయును. (ప్రకాశముగా) దాహము. దాహము. కొంచెమునీరు నీడ యిచ్చి నన్నుఁ గాపాడుఁడు. (యుధిష్ఠిరుని సమీపించును. అందఱు లేచి నిలుచుందురు.)

యుధి : మునీ ! అభివాదములు,

చార్వా : ఇది యభివాదసమయము కాదు. నీ రిచ్చి నన్ను గౌరవింపుఁడు.

యుధి : మునీ ! ఆసన మిదిగో ! స్వీకరింపుము.

చార్వా : (కూర్చుండి) మీరును గూర్చుండుఁడు.

యుధి : ఓరీ : ఎవ రక్కడ ?

కంచు : (ప్రవేశించి) దేవా ! ఏమియాజ్ఞ ?

యుధి : జయంధరా ! నీళ్ళు గొనితెమ్ము. మునికి దాహము వేయుచున్నది.

కంచు : చిత్తము. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి సమీపించి) మహారాజా ! చల్లనిచక్కనిమంచినీళ్ళతో నిండిన పెద్దపాత్ర మిదిగో ! ఇది చిన్నచెంబు.

యుధి : మునీ ! దాహము పుచ్చుకొనుము.

చార్వా : (కాళ్ళు కడుగుకొని యాచమించి) నీవు క్షత్త్రియునివలె నున్నావు !

యుధి : ఔను. నేను క్షత్త్రియుఁడనే.

చార్వా : ఆత్మజన నాశనమున కాలవాలమైన యుద్ధము నిత్యము చేయుచుండు మీచేతినీళ్లు ముట్టుకొనఁగూడదు. కానిమ్ము. ఈ చల్లని నీడ చేతను సరస్వతీనదీ వాయువుల వీవనచేతను నేను శ్రమముఁ బాపుకొందును.

ద్రౌప : బుద్ధిమతికా ! మునికి విసనకఱ్ఱతో విసరవే.

(చేటి యట్లు చేయును)

చార్వా : మంచిది. మా కిట్టి మీయుపచారము లుచితములే.

యుధి : మునీ ! నీ కింతపరిశ్రమ కలుగుటకుఁ గారణమేమి ?

చార్వా : మునిజనసులభ మగుకుతూహలముతో మహాక్షత్రియు లిరువురకు జరుగు ద్వంద్వయుద్ధముఁ జూడ శమంతపంచకమునఁ దిరిగితిరిగి యట నర్జునసుయోధనుల కగు ముష్టియుద్ధముఁ జూచి యీశారదాతపము బలవత్తరమగుటచే నాయుద్ధము ముగియకుండఁగనే యిటకు వచ్చితి.

అందఱు : (విషాద మందుదురు.)

కంచు : మునీ ! అట్లు కాదు. భీమసుయోధనుల కని చెప్పుము.

చార్వా : నీకుఁ దెలియనివిషయమున న న్నేల యాక్షేపింతువు?

యుధి : మునీ ! చెప్పుము. చెప్పుము.

చార్వా : ఒక్కనిముసము విశ్రమించి నీ కంతయుఁ జెప్పెదను. కాని, యీముసలికంచుకికిఁ జెప్పను.

యుధి : చెప్పుము. చెప్పుము. సుయోధనార్జునులకే ?

చార్వా : ఔ నని మొదటనే చెప్పితిని.

యుధి : (కన్నీళ్ళతో) భీమసుయోధనులకుఁ గాదా !

చార్వా : అది జరిగిపోయినవిషయము.

యుధి : ద్రౌప : (మూర్ఛిల్లుదురు)

కంచు : (చన్నీరు చల్లి) దేవా ! ఊఱడిల్లుము. దేవీ ! ఊఱడిల్లుము.

చేటి : దేవీ ! ఊఱడిల్లుము.

యుధి : ద్రౌప : (తేరుకొందురు)

యుధి : ఏమన్నావు? మునీ! భీమసుయోధనులగదాయుద్ధ మిది వఱకే జరిగిపోయినదా !

ద్రౌప : (ఆశ్చర్యముతో) ఏమి? అది జరిగిపోయిన విషయమా?

చార్వా : కంచుకీ ! వీ రిరువు రెవరు ?

కంచు : ఓయీ ! బ్రాహ్మణా ! ఈయన యుధిష్ఠిరమహారాజు. ఈమె పాంచాలరాజతనయ.

చార్వా : ఏమి! నృశంసుఁడ నగునేను దారుణవిషయమే చెప్పితినే!

ద్రౌప : హా ! నాథా ! భీమసేనా ! (మూర్ఛిల్లును)

కంచు : ఇపు డీతఁడు చెప్పినసంగతి యేమి ?

చేటి : దేవీ ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

యుధి : (కన్నిటితో) బ్రాహ్మణా !

క. పదసందిగ్ధతచే నే
నెద దుఃఖము నందుచుంటి నిఁక భీమునిస
త్యదశం జెప్పినయంతట
వదలెదఁ బ్రాణంబు సౌఖ్యపదవిం గనఁగన్. ౧౩

చార్వా : (సంతోషముతోఁ దనలో) నాయత్న మిదియే. (ప్రకాశముగా) అయినఁ దప్పక చెప్పవలసినది సంగ్రహముగాఁ దెల్పెదను. ఏలన, బాంధవ దుఃఖ వార్తను విస్తరించి చెప్ప రాదుగదా !

యుధి : (కన్నీరొలుక)

క. త్వరత్వరగాఁ జెప్పుము వి
స్తరముగనో సంగ్రహప్రధానముగానో
తరువాత వత్ససంగతి
త్వరగా విన నెదురుచూచెదన్ మునివర్యా ! ౧౪

చార్వా : వినుము

చ. కురుపతిభీమసేను లటు
ఘోరగదాధ్వనిఁ బోరుచుండఁగా

ద్రౌప : (లేచి) తరువాతఁ దరువాత ?

చార్వా : (తనలో) వీరి కీఁకఁ దెలివిరాకుండఁ జేయుటెట్లు ?
(ప్రకాశముగా)

సరగున నేఁగుదెంచె హలి
సన్నిధిఁ బోరిరి వారు శిష్యత
త్వరబలరాముఁ డంత నొక
దారుణసంజ్ఞ యొనర్పఁ గాంచి య
క్కురుపతి యొక్క పెట్టునను
గూలఁగనేసెను భీమసేనునిన్. ౧౬

యుధి : హా ! వత్సా ! వృకోదరా !(మూర్ఛిల్లును)

ద్రౌప : హా ! నాథ ! భీమసేనా ! హా ! మత్పరిభవప్రతీకారపరిత్యక్తజీవితా! జటాసుర బక హిడింబ కిమ్మీర కీచక జరాసంధ నిషూదనా ! సౌగంధికాహరణచాటుకారా ! ప్రతివచన మిమ్ము.
(మూర్ఛిల్లును)

కంచు : (కన్నీటితో) హా ! భీమసేనకుమారా ! ధార్తరాష్ట్ర కుల కమలినీప్రాలేయవర్షా!(సంభ్రమముతో) మహారాజా!ఊఱడిల్లుము. బుద్ధిమతికా ! దేవి నూఱడింపుము. మునీ ! నీవును మహారాజు నూఱడింపుము.

చార్వా : (తనలో) ఆఁ. ప్రాణము విడువు మని యూఱడించెదను. (పైకి) ఓయీ ! భీమాగ్రజా ! ఒక్కక్షణ ముండుము ఇంకను జెప్పెదను.

యుధి : (తెలివంది) మునీ! ఇంకను గథాశేష మున్నదా ?

ద్రౌప : (తెలివంది) ఆర్యా! అకథాశేష మేమి ? చెప్పుము.

కంచు : చెప్పు. చెప్పు.

చార్వా : అట్లాభీమసుక్షత్త్రియుఁడు హతుఁ డయి వీరసులభ మగుసద్గతి నందిన, భ్రాతృవధశోకమున నర్జునుఁడు గాండీవ మును విడిచి రక్తసిక్తమై యున్నభీమసేనునిగదను బలవంత ముగా నాతనిబిగిచేతులనుండి లాగుకొని శ్రీకృష్ణుఁడు వలదని నివారించినను వినక భ్రమితగదాఝుంకార సమ్మూర్ఛితగంభీర వచనధ్వనితోఁ జిఱునవ్వునఁ గురుపతి రమ్మని పిలుచుచుండ జంకక యాతనితో యుద్ధమునకు దిగెను. అపుడు సుయోధ నుని గదాఘాతమున నర్జునుఁ డస్తమించుట నిశ్చయ మని యెంచి బలరాముఁ డర్జునపక్షపాతి యగుకృష్ణుని బలవంతముగాఁ దన రథ మెక్కించుకొని ద్వారకానగరమునకుం గొంపోయెను.

యుధి : బాగు. బాగు. అర్జునా! గాండీవమును విడుచుటచే నీవు త్వరలోనే యనుజు ననుగమింపఁగలవు. ఇఁక, నే నేయుపాయమునఁ బ్రాణత్యాగమహోత్సవము చేసికొనఁ గలనో ?

ద్రౌప : హా! నాథా! భ్రాతృవత్సలా! భీమసేనా! నీతమ్ముఁడు నశిక్షితుఁడు నగునర్జునుఁడు బలవంతముగా నీచేతిలోనిగదను లాగుకొని దారుణశత్రువున కెదురుపోవుచుండ నీ వుపేక్షింప వచ్చునా ? (మూర్ఛిల్లును)

చార్వా : తరువాత నేను.........

యుధి : చాలు. మునీ! చాలు. ఇఁకపై వినున దేమి? హా! భీమ సేనా! లాక్షాగృహసముద్రతరణయానపాత్రమా! హా! కిమ్మీర

హిడింబాసురజరాసంధ జయమల్లా! హా! కీచక సుయోధనానుజ కమలినీకుంజరా ! హా ! ద్యూతపణమా ! మచ్ఛరీరస్థితిపరిఖేద శంకాసూదనా ! హా! మదాజ్ఞానంపాదకా! హా! కాంతారవ్యసన బాంధవా ! హా ! కౌరవవనదావానలా !

ఉ. ద్యూతమమత్వదుర్వ్యసన
దూషితబుద్ధిని నేను నోడ న
త్యాతతదంతిసన్నిభమ
హాబలవంతుఁడ వయ్యు భక్తి సం
ప్రీతి విధేయుఁ డైతివి వి
వేకిత నీ కిటు కీడుమూడెనే ?
భ్రాత ! మమున్ భువిన్ విడిచి
స్వర్గముఁ గాంచితె యార్తిగొల్పుచున్. ౧౩

ద్రౌప : (తెలివంది) మహారాజా ! ఏ మయినది ?

యుధి : దేవీ ! ఇఁక నే మున్నది ?

మ. బకకిమ్మీరహిడింబరాక్షసమహా
ప్రఖ్యాతవిధ్వంసి కీ
చకసంహర్త మదోద్ధతాత్మకజరా
సంధప్రభావాఢ్యఘో
రకరీంద్రాశని సద్గదాపరిఘవీ
ర్యస్ఫారబాహుండు తా
వకప్రాణేశుఁడు నర్జునాగ్రజుఁడు మ
ద్భ్రాతృప్యుఁ డేడీ యిఁకన్ ? ౧౪

ద్రౌప : నాథా ! భీమసేనా ! నావేణి నీవే ముడివైచెద నంటివి కదా! క్షత్త్రియవీరునకుఁ బ్రతినతప్పుట న్యాయమా? నీశపథము

చెల్లించుకొమ్ము. నే నిదే వచ్చుచున్నాను. (మూర్ఛిల్లును)

యుధి : (ఆకాశముఁ జూచి) అమ్మా పృథా! నీపుత్త్రునివార్త వింటివి గదా! అనాథుఁడ నగున న్నొక్కనినే విడిచి పోయినాఁడు కదా? వత్సా! జరాసంధశత్రూ! నీ వింత యల్పాయుష్కుఁడ వగుటకు లోకులు నీయం దేమి లోపములు గనిపెట్టిరి? కాదు, నేనే యనేకములు కనిపెట్టితిని. నీవు

మ. సకలోర్వీతలమున్ జయించియును నా
సాన్నిధ్యమం దుంచి యా
రక సిగ్గొందుట జూదమందుఁ బణమై
క్రౌర్యంబు లే కొప్పుటల్
వికలుం డౌవలలుం డనన్ విరటపృ
థ్వీపాలు సేవించుటల్
సుకృతీ! సూచన లౌచుఁ దెల్పెఁగద! య
చ్చో నీ భవిష్యద్దశన్. ౧౫

మునీ! ఏమంటివి? ("కురుపతి భీమసేను లటు" అను పద్యము పూర్తిగాఁ జదువును.)

చార్వా : ఔ నది నిజమే.

యుధి : ఏమి నా దురదృష్టము! బలరామా! కృష్ణాగ్రజా!

శా. జ్ఞాతిప్రీతి మనంబునందు లవమై
నన్ జూపుటల్ క్షత్త్రియా
పేతన్యాయము పోని కృష్ణభగవ
త్ప్రీతంబు లైనట్టి మ
ద్భ్రాతృస్నేహము నెంచవై తిరువురున్
బఖ్యాతశిష్యుల్ మఱే

రీతిన్ మాపయిఁ గ్రోధ మాతనిపయిన్
ప్రేమంబునుం జూపితో? ౨౦

(ద్రౌపదిని సమీపించి) ఓ పాంచాలీ! లెమ్మ. లెమ్మ. మన మిరువురము సమానదుఃఖము గలవారమే. మాటిమాటికి మూర్ఛిల్లి నన్ను బాధించెదవేల?

ద్రౌప: (లేచి) దుశ్శాసనహతకుఁడు విప్పివేసిన నా కేశపాశమును, దుర్యోధనునిఁ జంపుటచే నాతని రక్తముతోఁ దడిసిన చేతులతో నానాథుఁడు ముడివేయవలయును. ఓసీ! బుద్ధిమతికా! నీముందే కదా నాధుఁడు శపథము చేసెను? ఇపుడేకదా దేవకీనందనుఁడు నాకు వేణీసంహారమహోత్సవము జరుపుట కెల్ల సంభారములు సిద్ధముచేయుఁ డని సందేశమంపెను! కావున, వికసించిన పువ్వులఁ దెచ్చి దండగ్రుచ్చి నా వేణికిఁ జుట్టవే. శ్రీకృష్ణుని మాట విను. ఆయనయాదేశము వ్యర్థపుచ్చుట తగునా? అయ్యో! అతి సంతప్తచిత్తమున నే నేమియో పలవరించుచున్నాను. ఇంకను దూర మేఁగియుండని యార్యపుత్త్రుని నే ననుగమించెదను. మహారాజా! చితి నేర్పఱుపుము. నీవును క్షత్త్రియధర్మ మనుసరించి శత్రుసిర్దళనమున కేఁగవలయును.

యుధి: పాంచాలీ! యుక్తముగాఁ బలికితివి. కంచుకీ! ఈతపస్వినికై చితి సిద్ధపఱచి యామె యసహ్యావేదనఁ బాపుము. నాకు సజ్య మగుధనువు గొనితెమ్మ. పోనిమ్మ. వి ల్లెందుకు?

గీ. భీమసేనుని రక్తసిక్తామలగదఁ
గైకొని కిరీటి విడిచెఁగా గాండివంబు
నటులె నేనును నర్జును ననుసరింతు
నదియె శ్రేయము నాకు జయం బిఁకేల? ౨౧

చార్వా : రాజా! నీ మనము రిపుజయవిముఖమైనచో నెక్కడనో ప్రాణత్యాగము చేసికొనుము. అంతదూరము పో నేల ?

కంచు : (రోషముతో) ఛీ! మునిజనులకుఁ దగనట్లు రాక్షసులకుఁ దగినట్లు పలుకుచున్నావు.

చార్వా : (భయమునఁ దనలో) వీఁడు నన్నుఁ గనిపెట్టలేదుగదా కొంపముంచి (ప్రకాశముగా) ఓయీ! కంచుకీ! ఇటు వినుము. అర్జున దుర్యోధనులకు గదాయుద్ధము జరుగుచున్నదికదా! వారిరువుర గదాభుజసారము నెఱుంగుదును. ఇంతగా దుఃఖించుచున్న యీరాజర్షి మఱేమి దుర్వార్త వినవలసివచ్చునో యని య ట్లంటిని.

యుధి : (కన్నీరు విడిచి) మంచిది. మునీ! మంచిది. నాకు హితమును దెలిపితివి.

కంచు : మహారాజా! ఏమిది! శోకాంధత్వమున దేవసదృశుఁడవగు నీవే క్షాత్త్రధర్మమును విడిచి సామాన్యునివలె విచారింతువు ?

యుధి : ఆర్యా! జయంధరా!

మ. పరిఘప్రస్ఫుటపీనబాహుయుగళుం
   బద్దండశౌర్యాత్ములై
యరు ధారీతిఁ గుబేరపట్టణము శ
   క్రావాసముం జేరి దు
ర్భరవీర్యంబును జూపినట్టి ఘనులన్
   భంజించి దుర్యోధనుం
డురుభూమిన్ బడవైచి నిల్వఁ గనఁగా
   నోపన్ తదీయాస్యమున్. ౨౨

ఓ పాంచాలరాజతనయా! నా దుర్నయమున సంభవించిన దీదుర్గతి. ఎంత త్వరలో నగ్ని ప్రజ్వరిల్లిన నంతత్వరలోఁ జచ్చిన బంధుజనములఁ గలిసికొనఁగలము.

ద్రౌప : ఆర్యా! కట్టెలు చేర్పుఁడు. ఏమి! మహారాజుమాట యెవరును వినరే! హా! నాథా! నీవు లేనికారణమున మహారాజును బరిజనులు సైత మవమానించుచున్నారు గదా!

యుధి : మహర్షీ! నా మాట యెవరును వినుటలేదు. నీవైన నింధన ప్రసాధనమునఁ బ్రసాదము చూపుము.

చార్వా : ఇది మునిజన విరుద్ధము. (తనలో) నాకోరిక తీరినది. వీరికిఁ గానరాకుండ సమీపమున నింధనములఁ బ్రజ్వలింపఁ జేయుదును. (ప్రకాశముగా) రాజా! ఇట్టిస్థితిలో నే నిట నిలువఁ జాలను. (నిష్క్రమించుచు)

యుధి : దేవీ! నేఁ జెప్పినపని నెవ్వరును జేయరైరి. పోనిమ్ము. నేను స్వయముగానే కట్టెలు ప్రోఁగుచేసి చితి యంటించు కొందును.

ద్రౌప : త్వరగా. మహారాజా! త్వరగా.

(తెరలోఁ గలకలము)

ద్రౌప : (భయముతో విని) మహారాజా! ఇది యెవఁడో బలగర్వితుని సింహనాదమువలె నున్నది. ఇంక నేయప్రియమునో వినఁగనే మన మాలసించుచున్నాము.

యుధి : విలంబనము వలదు. లెమ్ము (నడతురు) పాంచాలీ! అమ్మకుఁ గాని నీసపత్నులకుఁ గాని చెప్పవలసిన దేమన్న నున్నఁ జెప్పి పరిజనులను బంపి వేయుము.

ద్రౌప : మహారాజా ! మీయమ్మగారికి "బక హిడింబ కిమ్మీర కీచక జరాసంధ జయమల్లుఁ డగు నీమధ్యమ పుత్త్రుఁడు నిర్భాగ్యురాల నగు నామూలమునఁ బరలోకగతి నందె" నని విన్నవించెదను.

యుధి : బుద్ధిమతికా ! అమ్మగారికి నామాటగా నిట్లు చెప్పుము :

గీ. ఎవనిభుజశక్తిచే లక్కయింటినుండి
బయట పడఁ గాంచిరో యగ్నిబారినుండి
నీవు సుతు లట్టి నీయన్ననిసువు భీమ
బలుఁడు లేఁ డని నే నెట్లు పలుకువాఁడ ? ౨౩

ఆర్యా! జయంధరా! నీవు సహదేవునికడ కేఁగుము. పాండుకుల బృహస్పతియు, మైత్రేయుఁడు, నగునాతనితో "సకలకురు కుల కమలాకరబడబానలుఁ డగుయుధిష్ఠిరుఁడు పరలోకమున కేఁగుచు 'ఇష్టుఁడవు, అనుకూలుఁడవు, నిత్యము కోరఁదగిన వాఁడవు, దుర్వ్యసనములకు దూరుఁడవు, అభ్యుదయకష్టముల పట్ల ధైర్యవంతుఁడవు నగునిన్నుఁ జాలఁ గౌఁగిలించుకొని శిరము మూర్కొని యిట్లు పలికె' నని చెప్పుము.

చ. వయసునఁ జిన్నవాఁడవును
ప్రాజ్ఞత మత్సదృశుండ వీవు నే
వయసున నీకుఁ బెద్దను స్వ
భావవివేకిత మద్గురుండవే
ప్రియతమ ! నీవు మ్రొక్కెడుచు
వేఁడుదు వీడుము కూర్మి యింక నా
పయిని పితౄణమోచనకుఁ
బ్రాంజలిఁ దర్పణ మిచ్చుచుండుమీ"! ౨౪

మఱియుఁ జిన్నతనమునుండి నాకడఁ బెరిఁగినవాఁడు, నిత్యము సదభిమాని, మేరుసమానధైర్యసారుఁడు నగునకులుఁడును నా మాటఁ బాటించువాఁడు కావున నతనితో నిట్లంటి నని చెప్పుము: "వత్సా! నీవు మామార్గ మనుసరింపరాదు.

చ. మఱువుము భీము నర్జునుని
మమ్ముఁ దలంపకు మింకఁ బాండుభూ
వరుకులనాశనంబునఁ గృ
పన్ విడువన్ వలెఁ దర్పణంబులన్
బరమవిధేయతన్ రిపుల
పజ్జనొ యాదవులిండ్లయందొ భీ
కరవనియందొ ప్రాణములఁ
గాచుకొనం దగు నీవు తమ్ముఁడా!" ౨౫

జయంధరా! పొమ్ము. నీవు తప్పక చెప్పిరావలయునుజుమా! నాపై నొట్టుసుమా! ఆలసింపక త్వరగాఁ బోయిరమ్ము.

ద్రౌప: ఓసీ! బుద్ధిమతికా! ప్రియసఖి సుభద్రకు నామాటగా నిట్లు చెప్పుము. "చెల్లీ! వత్స యగునుత్తర కిపుడు నాలవమాసము. కాన, మనకులము నిలుపఁ గలయామె గర్భమును నీవు కడుఁ గాపాడవలయును. ఎప్పటికైన నాపట్టియే సురలోకగతుల మైనమాకు నీటిచుక్కలు విడువఁ గలుగును."

యుధి: (కన్నీటితో) అయ్యో! కష్టముగదా!

చ. ధరణిని వేళ్ళువాఱి బహు
ధా విటపంబుల విస్తరించి దు
ర్ధర మగుమ్రాను పెంచియును
దైవకృతంబునఁ జెట్టె దగ్ధమై

పరగిన ఖేతయంకురము
పై నడియాస లిఁకేల? యట్టియం
కుర మది పెర్గి పెద్దదయి
కూర్మిని నీడ నొసంగునం చహా! ౨౭

ద్రౌపదీ! ఇఁకఁ జాలును. (కంచుకిని జూచి) ఆర్యా! జయంధరా! నాపై నొట్టుపెట్టుకొన్నను నీ వడుగు కదల్పవైతివే!

కంచు: (ఏడ్చుచు) హా! దేవా! పాండురాజా! అజాతశత్రు భీమార్జున నకులసహదేవు లగునీపుత్త్రుల కెట్టిగతి పట్టినది! హా! కుంతీదేవీ! భోజరాజభవనపతాకా!

శా. నీకున్ సోదరపుత్త్రికుండు మఱియున్
కృష్ణాగ్రజుం డర్జునా
శా కల్యుం డగుస్యాలకుండు కురువం
శధ్వంసి యౌభీముసు
శ్లోకుం డౌగురుఁ డా హలాయుధుఁ డహా!
లోకాశ్రయం బైనయ
స్తోకత్వత్సుతకాననంబుఁ గడుమ
త్తోన్మత్తతన్ గాల్చెఁగా! ౨౮

(ఏడ్చుచు నిష్క్రమించును)

యుధి: జయంధరా! జయంధరా!

కంచు: (ప్రవేశించి) దేవా! ఏమి యాజ్ఞ?

యుధి: ఏమందును? మీయదృష్టము లిట్లున్నవి! ఒకవేళ నర్జునుఁడే జయించి వచ్చినచో నాతనితో నిట్లంటి ననుము:

చ. నిజముగ భీముచావునకు
నిక్కపుహేతువు నీరి మైన న

గ్రజుఁ డతఁ డౌను కృష్ణునకుఁ
గావునఁ గోపముఁ జూప కింతయున్
స్వజనుఁ డతండు నాపయినిఁ
బాయుము కూరిమి నెల్ల పిమ్మటన్
విజనవనంబుఁ జేరు మిఁక
వీడుము క్రూరపుక్షత్త్రధర్మమున్. ౨౮

కంచు : చిత్తము దేవా ! (నిష్క్రమించును)

యుధి : (అగ్నిని జూచి యానందముతో) ప్రజ్వలించు ధూమశిఖలను చేతులతో నావంటి వ్యసనిజనులను బిలుచుచు హుతాశనభగవానుఁడు చక్కగాఁ బ్రకాశించుచున్నాఁడు. నే నిదే యాతని కింధన మౌదును.

ద్రౌప : మహారాజా! దయచూపుఁడు. నానాథునకు నే నన్న నెంతయో ప్రేమ. కావున, ముందు నేనే పోవుదును.

యుధి : ఐనచో, నీమహాభ్యుదయ మిరువురము ననుభవింతము.

చేటి : ఓహో ! లోకపాలకులారా ! చంద్రవంశరాజర్షి యైన యీమహాత్ముని మీరైన రక్షింపుఁడు. రక్షింపుఁడు. ఈరాజు రాజసూయసంతర్పితహుతవహుఁడు, ఖాండవసంతర్పితహుతవహుఁ డగుకిరీటియన్న, సుగృహీతనామధేయుఁ డగుయుధిష్ఠిర మహారాజు, ఈదేవి పాంచాలరాజకులదేవత. వేదిమధ్యసంభవ. యాజ్ఞసేని. ఇట్టివీ రుభయులు నిర్దయుఁ డగుకాలానలున కింధనము లగుచున్నారు. రక్షింపుఁడు. రక్షింపుఁడు. (వారి ముందుఁ బడి) దేవా ! దేవీ ! ఏమి చేయుదురు !

యుధి : ఓసీ! బుద్ధిమతికా ! వత్సలుఁ డగుతమ్ముఁడు ప్రియుఁ డగునాథుఁడు లేనపు డేమి చేయవలయునో యది చేసెదము.

నీవు పోయి నీళ్ళు తెమ్ము.

చేటి : చిత్తము. దేవా ! (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) జయము. జయము. మహారాజా ! ఇదిగో నీరు.

యుధి : పాంచాలీ ! నీవుకూడ నీపక్షపాతి యగుభీమునకును, నీప్రియుఁ డగునర్జునునకును జలతర్పణ మిమ్ము.

ద్రౌప : మహారాజా! నీ వట్లొసంగుము. నే నగ్నిఁ బ్రవేశించెదను.

యుధి : దేవీ ! లోకవృత్త మతిక్రమింపరాదు. బుద్ధిమతికా ! నీరిటు తెమ్ము.

చేటి : (ఇచ్చును)

యుధి : (కాళ్ళు కడుగుకొని యాచమించి) గాంగేయా! భీష్మాచార్యా! ప్రపితామహా ! శాంతనవా ! నీ కిదే సలిలాంజలి. పితామహా ! విచిత్రవీర్యా ! నీ కిదే జలతర్పణము. (కన్నీటితో) తండ్రీ ! నీవంతు వచ్చినది. స్వర్గ మలంకరించినపితృదేవా! పాండుమహారాజా ! సుగృహీతనామా ! నీ కివే జలాంజలులు.

క. ఇఁకనుండి తర్పణంబుల
సుకృతాత్ములు మీ కొసంగఁ జొప్పడ దేనున్
సుకముగఁ గ్రోలుము తాతా !
యకుటిల యగునంబతోడ నశ్రుజలంబున్. ౨౯

క. జలజాక్షభీమసేనా !
సలిలం బిది నీకు నాకు సమభుక్తము దూ
పిలి త్రాగఁబోకు మొంటిగ
నిలువుము నే వచ్చుచుంటి నిక్కము వత్సా ! ౩౦

ఏమి ! సుక్షత్త్రియునిగతి నందినతమ్ముని నేను వెళ్ళి చూడఁ

గలనా ? వత్సా ! భీమసేనా !

మ. జననీస్తన్యముఁ గ్రోలువేళ మును వ
త్సా ! నేను గ్రోలంగ నీ
వును నాపిమ్మటఁ గ్రోలువాఁడవుగ మ
ద్భుక్తాన్న శేషంబె కై
కొనుచున్ భక్తిమెయిన్ మెలంగితివి నేఁ
గొన్నంతనే సోమమున్
గొనినా విప్పుడు న్యాయమే మును గొనన్
గుణ్యా ! నివాపాంబువుల్ ? ౩౧

దేవీ ! భీమునకు నీవును జలాంజలి విడువుము.

ద్రౌప : చేటీ ! నీ రిటు తెమ్ము.

చేటి : (తెచ్చి యిచ్చును)

ద్రౌప : (కైకొని జలాంజలి నింపి) మహారాజా ! ఎవరి కీజలాంజలి యొసఁగుదును ?

యుధి : క. జననిని గాంధారినివలె
ననుపమదుఃఖాంబుధారయందున ముంపన్
జనె దివమున కెవ్వఁడు నా
తనిఁగూర్చి యొసంగు దేవి! తర్పణ మిపుడే. ౩౨

ద్రౌప : నాథా ! భీమసేనా ! స్వర్గగతుఁడ వైననీకుఁ బరిజనోప నీత మగు నిది పాదోదక మగుఁగాక !

యుధి : ఫల్గునాగ్రజా !

క. శపథము ముగియకమును స్వ
ర్గపదముఁ జేరంగఁ జనినఘనభుజ ! నీ కి

ట్లపగతకేశగ ద్రౌపది

యిపు డొసఁగునివాపజలము నెంతయు బెంగన్. ౩౩

ద్రౌప : మహారాజా! లెండు! లెండు. ఈసరి కాతఁడు చాలదూర మేఁగి యుండును.

యుధి : (కుడిప్రక్క యదరుటఁ గని) పాంచాలీ ! త్వరలోనే యీ యగ్నిముఖమున భీమసేనుని గలిసికొందు నని కాఁబోలు నాకు శుభసూచనము లగుచున్నవి.

ద్రౌప : హుతాశనభగవానుఁడు చక్కఁగాఁ బ్రజ్వలించు చున్నాఁడు.

[తెరలోఁ గలకలము, సంభ్రాంతుఁడై కంచుకి ప్రవేశించును.]

కంచు : మహారాజా ! రక్షింపుము. రక్షింపుము. ఇదిగో దురాత్ముఁ డగుకౌరవాధముఁడు క్షతజాభిషేక పాటలితాంబరశరీరియై రక్తార్ద్రభీషణగదాపాణియై కాలదండముఁ జేఁబూనినయముని వలెఁ బుణ్యారా లగుపాంచాలి నిటనట వెదకుచు నిటే వచ్చుచున్నాఁడు.

యుధి : అయ్యో! దైవమా! నీనిర్ణయము జరుగుచున్నది. హా! అర్జునా ! (మూర్ఛిల్లును)

ద్రౌప : అయ్యో ! ఆర్యపుత్త్రా ! మత్స్వయంవరస్వయంగ్రహదుర్లలితా ! నీప్రియుఁ డగునగ్రజుని గలిసికొని మమ్మిరువురను విడిచితివిగదా ! (మూర్ఛిల్లును)

కంచు : దేవా ! ఊఱడిల్లుము.

యుధి : హా ! వత్సా ! సవ్యసాచీ! హా! ముల్లోకవిజయమల్లా ! హా ! నివాతకవచోద్ధరణనిష్కంటకీకృతామరలోకా ! హా! బదర్యాశ్రమమునిద్వితీయతాపసా ! హా ! ద్రోణాచార్యప్రియశిష్యా!

హా ! అస్త్రశిక్షాబలపరితోషితగాంగేయా ! హా ! రాధేయకుల కమలినీప్రాలేయవర్షా ! హా ! గంధర్వనిర్వాసిత సుయోధనా ! హా ! పాండవకులకమలినీరాజహంసా ! అర్జునా !

ఉ. అనుఁగుందల్లికి మ్రొక్కకుండ వినయం
బాత్మన్ గుదుర్కొల్పిన
న్ననుఁ బ్రేమంబునఁ గౌఁగిలించి మిగులన్
మూర్ధంబునందున్ మదా
జ్ఞను గైసేయక యీస్వయంవరవధూ
సమ్మాన్యతోఁ బల్కకే
మని దీర్ఘం బగునీప్రవాసమున కా
హా ! యేఁగియున్నాఁడవో ? ౩౪

(మూర్ఛిల్లును)

కంచు : అయ్యో ! కష్టము. సుయోధనదురాత్ముఁ డిటులే వచ్చుచున్నాఁడు.

యుధి : (లేచి) ఓహో ! ఇపుడు కాలోచితమైన ప్రతీకారమే చేయఁదగినది. ఓసీ ! బుద్ధిమతికా ! పాంచాలిని జితికడకుఁ దీసికొని రమ్మా. నేనును వచ్చుచున్నాను.

చేటి : ఆర్యులారా ! రక్షింపుఁడు. రక్షింపుఁడు.

కంచు : భద్రా ! ఈమాట దేవియన్న యగు ధృష్టద్యుమ్నునకుఁ గాని నకుల సహదేవులకుఁ గాని చెప్పుము. లేనిచో నీస్థితిలో నున్న మహారాజును రక్షింపఁగలుగువా రెవరు ? భీమార్జును లస్తమించిరిగదా !

(తెరలోఁ గలకలము. తరువాత.)

ఓశమంతపంచక సంచారులారా ! రక్తపానేచ్ఛ గలరాక్షస

పిశాచ భూత భేతాళ కంక గృధ్ర జంబుకోలూకవాయసములకు దక్కఁగా మిగిలిన యోధులారా ! నన్నుఁ జూచి యిట్లు భయపడుదురేల! యాజ్ఞసేని యెట నున్నదో నాకుఁ జెప్పుఁడు. ఆమె కానవాలు చెప్పుచున్నాను. వినుఁడు :

చ. తొడ యొకచేతఁ గొట్టుకొను
            తొందరలోఁ గురురాజు లీలఁ జూ
పిడఁ బయి దుస్ససేనుఁ డతి
            హీనత నొల్చియు సంబరంబు లా
బిడయలివేణి నీడ్వఁ గచ
            భిన్నత నొ ప్పఱియున్నసాధ్వి యె
క్కడఁ గలదో యెటుండెనొ జ
            గంబునఁ జూపుఁడు నాకుఁ జెచ్చెరన్. 32

కంచు : దేవీ ! యాజ్ఞసేనీ ! నీ విప్పుడు సైతము రక్షాశూన్యవై కురుకులకలంకునిచేఁ బరిభవము నందుచున్నావుగదా !

యుధి : (తటాలున లేచి) పాంచాలీ ! భయపడకు. భయపడకు. ఎవ రక్కడ ? సజ్జిత మైనధాను విటు తెమ్ము. దురాత్మా ! దుర్యోధనహతకా ! రా రమ్ము, నీగదాకౌశలమున నీ కేర్పడిన మహాగర్వ మిపుడే బాణపరంపరల నణంచెదనురా. ఓరీ ! కురుకులవినాశకా !

గీ. మును జరాసంధుఁ జంపినయనుజుఁ గుపిత
హరకిరాతవిద్వేషుని బరిగణించి
నీకువలె బాయినై పోయి నిలువలేను
జాలిచే నిన్నుఁ జంపంగఁ జాల నోరి !

(గదాపాణియు క్షతజసిక్తసర్వాంగుఁడు నైనభీమసేనుఁడు ప్రవేశించును.)

భీమ : (ఉద్ధతుఁడై పరిక్రమించి) ఓహో! శమంతపంచకసంచారు లగుసైనికులారా! ఎందుల కీయావేగము ?

ఉ. భూతమఁ గాను రాక్షసుఁడ
బొత్తిగఁ గాను విరోధిర క్తసం
పాతశరీరుఁడన్ శపథ
వార్నిధి దాఁటినక్షత్రియుండ నీ
రీతిని బాఱి చచ్చిన క
రివ్రజఘోటకదేహరాజిలో
భీతిని దాఁగుకొందు రిసి !
వీరరణానలదగ్ధశేషులై. 32

పాంచాలి యెట నున్నదో మీరు నాకుఁ జెప్పుఁడు.

కంచు : దేవీ! పాండుస్నుషా! లెమ్ము. లెమ్ము. త్వరగాఁ జితిఁ బ్రవేశించుట మేలు.

ద్రౌప : ఏమి ? నే నింకను జితిని సమీపింపకుందునా ? (సమీపించును)

యుధి : ఎవఁడురా యక్కడ? సజ్జితధనువును దెమ్ము. ఎవరును బరిజనులు లేరే ? పోనిమ్ము. బాహుయుద్ధముననైన దురాత్ముఁ డగునీతనిని గాఢముగాఁ గౌఁగిలించుకొని మండు చున్నయీయగ్నికుండమునఁ గూల్చెదను. (అందుకు నడుముకట్టి సిద్ధపడును.)

కంచు : దేవీ! పాండురాజుకోడలా! దుశ్శాసనుఁడు లాగివిడిచిన యీకురు లిపుడు కంటి కడ్డుపడుచున్నవి. నీవే ముడుచుకో! ప్రతీకారాశ భగ్నమైనదికాదా! చితిని ద్వరగాఁ జేరుము.

: దేవీ! వలదు. వలదు. దుర్యోధనహతకుఁడు చావకుండ

నీకురులు ముడివేసికొనవలదు.

భీమ : పాంచాలీ ! నేను బ్రతికియుండఁగా దుశ్శాసనుఁడు లాగి విడిచిన నీకురులను నీచేతితో ముడివేసికొనవలదు.

ద్రౌప : (భయపడి పరుగెత్తును)

భీమ : ఆఁగు మాఁగుము. ఎట కేఁగెదవు? (కొప్పుపట్టఁ జూచును)

యుధి : (వేగమున భీమునిఁ గౌఁగిట నదిమిపట్టి) దురాత్మా ! భీమార్జునశత్రూ ! దుర్యోధనహతకా ! పాపీ !

గీ. శైశవం బాది యెగ్గులు సలిపినావు
నిత్యమును దుర్మదా ! రాజనికర మీగ్గె
నాబలంబున నిటు చిక్కి నాదు బాహు
పంజరంబునఁ జావక పదము నిడుదె? త్రిలొ

భీమ : ఏమది? దుర్యోధనుఁడ నను శంకచేఁ గాఁబోలు నార్యుఁడు నన్ను నిర్దయతో నింతకఠినముగాఁ గౌఁగిలించినాఁడు. ఆర్యా ! కనికరింపుము. కనికరింపుము. విధేయుఁడను.

కంచు : (నిరూపించి, సంతోషముతో) మహారాజా ! అదృష్టము. అదృష్టము. మనభీమసేనకుమారుఁడే దుర్యోధనునిరక్తముతో శరీరము బట్టలు తడిసియుండుటచే నెఱ్ఱఁబడి యానవాలు పట్ట వీలుకానిరీతి నున్నాఁడు. ఇపు డేమియు సందేహము లేదు.

చేటి : (ద్రౌపదిని గౌఁగిలించుకొని) దేవీ ! ఆఁగుము. ఆఁగుము. ఇదిగో ! ఇదే తనప్రతిజ్ఞ నెఱవేర్చుకొని నీనాథుఁ డగుభీమసేనుఁడే నీవేణీసంహారనిమిత్తము విచ్చేసినాఁడు.

ద్రౌప : ఏమే ! నన్ను దొంగమాటలతో నూఱడింపఁజూతువా ?

కంచు : మహారాజా ! వర్ధిల్లుము.

యుధి : జయంధరా ! నిజముగా నీతఁడు నాయనుజవైరి

ధనహంతకుఁడు కాఁడుగదా ?

భీమ : దేవా ! అజాతశత్రూ ! భీమార్జునగురూ ! ఇంకను సుయోధనహంతకుఁ డెక్కడ ? నాచే నాదురాత్ముని

చ. తనువు ధరం బడెన్ బరమ
దర్పముతో రుధిరార్ద్ర చందనం
బును నొడలంతఁ బూసికొని
పొంగితి నీకును సర్వరాజ్యల
క్ష్మిని సమకూర్చితిన్ సమర
కీలలఁ గౌరవవంశమెల్ల నిం
ధనముగ దగ్ధమయ్యె నిఁక
ధారుణి నయ్యది నామ శేషమే. ౩౮

యుధి : (భీమునిఁ జూచుచుఁ గన్నీరు తుడుచుకొనును)

భీమ : (పాదములపైఁ బడి) ఆర్యా ! జయము. జయము.

యుధి : (సంతోషముతోఁ గౌఁగిలించుకొని కన్నీటితో) నాయనా ! భీమసేనా ! వృకోదరా ! పృథానందనా ! ఫల్గునాగ్రజా ! పాండుకులప్రదీపా !

భీమ : ఆజ్ఞాపింపుము.

యుధి : కన్నీరు నిండినకన్నులతో నిన్నుఁ గనుఁగొనన్నైతిని. నీవు కిరీటితోఁ గూడ జీవించియున్నావా ?

భీమ : సమస్తశత్రువులను జంపి మహారాజవై నీ వుండఁగా భీమార్జునుల కేమిభయము ?

యుధి : (మరల గాఢముగాఁ గౌఁగిలించుకొని)

చ. రిపువధ కేమిలే నిజప
రిస్థితి చెప్పు బకాసురారివే ?

కపటము కాదుకా? నిజము
గాఁ బ్రియసోదరరత్న మౌదువే?

భీమ: ఆర్యా! ఔను.

యుధి: విపుల జరాసుతాగ్రణి వి
భీతక వక్షపు నెత్రు టేటినీ
టిపయి మహోత్తమంబుగ న
టించిన వీరుఁడ వీవె? చెప్పుమా! ౪౦

భీమ: ఆర్యా! అవును. ఒక్కక్షణము నన్ను విడువుఁడు.

యుధి: ఇంకను సశేష మేమైనఁ గలదా?

భీమ: మంచిసశేషమే యున్నది. ఇదే దుర్యోధన దుశ్శాసనరక్తముతోఁ దడిసియున్న చేతులతో దుశ్శాసనుఁడు విడఁ గొట్టిన పాంచాలి కేశపాశమును ముడివేయవలయును.

యుధి: ఐనచో సత్వరమే కానిమ్ము. ఆతపస్వినికి వేణీసంహార మహోత్సవము జరుగుఁగాక!

భీమ: దేవీ! పాంచాలీ! రిపుక్షయమైనది, నీ వింక వర్ధిల్లుము.

ద్రౌప: (సమీపించి) దేవా! జయము. జయము. (భయపడును)

భీమ: రాజపుత్త్రీ! నన్నుఁ జూచి భయపడకుము. ఏలన:

ఉ. ఏపశుతుల్యరాజు నిను
నీడ్చెనొ కొప్పును బట్టి నాఁడు త
త్పాపిని జంపి రక్తమును
బానము చేసితి నంటు చేతులన్
జూపుదుఁ దాఁకు మియ్యదియె
సూ కురురాజుతొడల్ గదన్ దగన్

రూపఱఁజేసి మేనునకు
రుద్దిననెత్తురు సంతసంబునన్. ౪౧

బుద్ధిమతికా ! పాండవపత్నిని బరిహసించిన భానుమతి యెట నున్నదే ! పోనిమ్ము. ఓయజ్ఞవేది సంభవీ ! యాజ్ఞసేనీ !

ద్రౌప : నాధా ! చెప్పుము.

భీమ : ("చ. గిరగిరఁ ద్రిప్పుకొంచు గద" అను పద్యము మరలఁ జదివి) ఆవేళ నే నన్నమాట మఱవలేదుకదా !

ద్రౌప : మఱవలేదు. నాధా ! అది యనుభవమే యైనది.

భీమ : (ద్రౌపది వేణిని ముడుచుచు) దుశ్శాసనునిచే విడివడి ధార్త రాష్ట్రులకుఁ గాళరాత్రి యైన యీ వేణి నిఁక నీవే ముడుచు కొనుము.

ద్రౌప : ఈపని యీమధ్య మఱచితిని. నీదయవలన మరల నేర్చుకొనెదను.

భీమ : (వేణిని ముడివేయును)

(తెరలో)

మహాసమరానలదగ్ధ శేషు లగు రాజులకు శుభ మగుఁగాక !

శా. ఏవేణిన్ ఖలుఁ డంటఁగాఁ గురుకులం
బెల్లన్ సమిత్రంబుగాఁ
జావంగాంచెనొ పాండుపుత్రులమహా
శౌర్యంబునన్ శత్రుకాం
తావేణుల్ విడిపోయె శాశ్వతముగా
ధన్యుండు భీముం డిదే
ఆవేణిన్ ముడివేసెఁ గాంతు రిఁక సౌ
ఖ్యంబుల్ ప్రజల్ రాజులున్. ౪౨

యుధి : దేవీ! యిదే యంతరిక్షచరు లగు సిద్ధజనులు వేణీ సంహారమహోత్సవమున ని న్నభినందింఁచుచున్నారు.

(కృష్ణార్జునులు ప్రవేశింతురు)

కృష్ణ : (యుధిష్ఠిరుని సమీపించి) సర్వశత్రుమండలము జయించి సానుజుఁ డైన పాండుకులచంద్రుఁడు యుధిష్ఠిరమహారాజు నకు జయమగుఁగాక!

అర్జు : ఆర్యా! జయము. జయము.

యుధి : (చూచి) ఏమి! భగవంతుఁ డగు పుండరీకాక్షుఁడు వత్స యర్జునుఁడునా యీ వచ్చినది! భగవానుఁడా! వందనములు. వత్సా! అర్జునా! నన్నుఁ గౌఁగిలించుకొనుము.

అర్జు : (నమస్కరించును)

యుధి : (కృష్ణునితో) భగవానుఁడా! పరమేశ్వరుఁడు పురాణ పురుషుఁడు నగు శ్రీమన్నారాయణుఁడే స్వయముగా శుభములు కోరుచుండ నాకు విజయముగాక మఱి యేమగును?

చ. గురుమహదాదివృత్తు లొన
గూడినమూర్తిని సర్వసృష్టి సం
భరహరహేతుభూతు నజు
భావన కందనివాని నెన్నఁడున్
మరణము లేనినిన్ను నొక
మాఱు తలంచినమాత్ర దుఃఖముల్
తొరఁగునటన్న దర్శనపుఁ
దోయది మున్గినఁ జెప్పనేటికిన్.

(అర్జునుని కౌగిలించుకొని) వత్సా! నన్నుఁ గౌఁగిలించు

కృష్ణ : మహారాజా! యుధిష్ఠిరా!

సీ. వ్యాసవాల్మీక్యాది పరమర్షి చంద్రముల్
వచ్చేసియున్నారు వేడ్కమీఱ
మాద్రీసుతులఁ గూడి మహితధృష్టద్యుమ్న
సేనాధిపతులు వచ్చిరి ముదమున
మాగధకులమున మాత్స్యకులంబున
యాదవకులమున నలరు నిఖిల
రాజగణంబులు పూజనీయులు విధే
యత వచ్చియుండిరి హితమతు లయి

గీ. తీర్థజలకలశంబులఁ దెచ్చి భుజము
లందునన్ నిల్పుకొని మోదమందుచుండి
నీకు రాజ్యాభిషేకంబు నెఱప మిగులఁ
దహతహను గాంచుచుండిరి ధర్మరాజ! ౪౪

చార్వాకుఁ డను రాక్షసుఁడు మునివేషమున వచ్చి నిన్ను వంచించిన సంగతి నేను వ్యాసమునివలనఁ దెలిసికొని, త్వరిత గతి నర్జునునితో వచ్చేసితిని.

యుధి : ఏమి? మమ్ముఁ జార్వాకుఁడు వంచించెనా?

భీమ : (కోపముతో) ఏమీ! ఆపాపాత్ముఁ డగు దుర్యోధన సఖుఁ డార్యుని చిత్తవిభ్రమము కలిగించి యెట నున్నాఁడు?

కృష్ణ : అతనిని నకులుఁడు సంహరించెను. రాజా! నీ కిఁక నే నేమిప్రియ మొనగూర్తును?

యుధి : భగవంతుఁడా! పుండరీకాక్షా! నీకృప నా కేమి యొసఁగ లేదు? నేను నిన్ను సామాన్యదృష్టితోఁ జూచియుంటిని. ంపుము దేవా!

చ. అరికుల మందె నాశనము
నక్షతి నుంటిమి నాకతంబునన్
బరిభవ మంది ద్రౌపదియుఁ
బట్టె నికారసముద్రతీరమున్
బరమకృపాసముద్రు భగ
వంతుని చెల్మిని గంటి మిట్లు ! నీ
వరకృపఁ గన్నమా కితర
వాంఛలు గల్గునె వేయు నేటికిన్. ౪౫

భ ర త వా క్య ము

శతవర్షంబులు పూర్ణకాములును సుస్వాంతాత్ములై మానవుల్
క్షితి నిశ్చంచల తావకీన శుభభక్తిం గాంత్రుగా కెంతయున్,
సతతంబున్ సుకృతాత్ములై నృపులు శశ్వన్మంగళాసక్తిఁ బూ
జ్యత విద్వద్గుణరక్తిఁ బ్రోచెదరుగా కానందులై లోకులన్! ౪౬

కృష్ణు : తథాస్తు. (అందఱు నిష్క్రమింతురు)

ఇది షష్ఠాంకము. సర్వము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

---

వ్యాసప్రోక్తము భారతం బది తలిర్పన్ భట్టనారాయణ
వ్యాసంగం బగు నాటకంబుగను గీర్వాణంబునన్, దాని "వే
ణీసంహారముఁ" దెల్గుచేసినబుధున్ శ్రీవేంకటేశున్ ననున్
శ్రీసంపన్న శ్రీశుఁ డోముతఁ గృపాశ్రీ మీఱ శ్రీదేవితోన్.

---

